ఎరదేఁ

# భారతిసాక్షాత్కారము

శ్రీ జటప్రోలు సంస్థానాధీశ్వరి

ధర్మకల్పవల్లి

## శ్రీ శ్రీ సురభి వేంకటరత్నమాంబా

## మహారాజ్ఞీమతల్లిగారికి

భక్తిపూర్వకముగా సమర్పితము.

---

— అంకితము. —

---



శ్రీరతనాంబికాకృపకుఁ జేరినవారలు భక్తులైరి, శ్రీ
వారిదయాసముద్రము నపారము, తద్రసమెల్లవేళఁ జే
కూరినవారు ధన్యులు నకుంఠితభక్తులు నైరి; కాన శ్రీ
వారిదె జన్మమన్న మఱి వారిదె పుణ్యమటన్నఁ జూడఁగన్॥

ఉ॥ కోరినవెంటనే తమ రకుంఠితభావముఁ బాదుకొల్పి నా
భారతిసత్కృతిన్ వినుచు భాగ్యముఁ దద్దయుఁ బ్రేమతోడఁ జే
కూర్చినట్టి మీదుకృపకున్ గడుమెచ్చినవాఁడనౌట నిం
డారినభక్తితోడుత సమర్పణఁజేసితి రత్నమాంబికా!॥ 2

ఉ॥ మీవలెఁ దెల్గుబాసపయి మిక్కుటమైనప్రియంబుఁ జూపు ధా
త్రీవరు లేరి? దేశికుని దేవునిఁబోలె భజించువార లీ
భూవలయా నుండిరె? ప్రమోదరసంబున నన్నుఁదేల్చు శ్రీ
దేవివిగాన నాదగునదృష్టము పండెను రత్నమాంబికా!॥ 3

క॥ భారతిసాక్షాత్కారము । శ్రీరత్నాంబ కొసఁగి కృతకృత్యుఁడనైతిన్
శ్రీరత్నలక్ష్మిసన్నిధి । నోరారంగాఁ జదివెడు నోము ఫలించెన్॥ 4

ఉ॥ పావనమైన యీ సురభివంశముఁ జొచ్చెడుభాగ్య ముండుటన్
భావనమైనసత్కృతిని వ్రాసెడుపుణ్యము నాకుఁ గల్గుటన్
దేవినిఁగూర్చినట్టికత దేవికినిచ్చుట మంచిదంచు భూ
దేవికి రత్నమాంబికకుఁ దిన్ననికానుకగ నీయఁగల్గితిన్॥ 5

ఉ॥ పావనసత్కృతిన్ సురభివంశపురాజ్ఞికి రత్నమాంబకున్
జేవదలిర్ప నంకితముఁజేసెడుభాగ్యము శ్రీసరస్వతీ
దేవి యనుగ్రహించె నిఁక దేనికి లోపముగల్గదంచు లో
భావనసేయుచుంటిని నృపాలురు దైవసమానులౌటచేన్॥ 6

గీ॥ "సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియ" గాన
నందు నీకృతి వాణీకృపా దరమున
వెలసెఁగావునఁ బ్రకటించుఫలముఁ గొమ్మా॥ 7

క॥ ననుఁ గన్నతల్లిరీతిగ
ననయముఁ బోషించు రత్నమాంబాసతినిన్
మనమునఁ గొల్చుటకంటెన్
ఘనమై తనరారునట్టి కార్యము గలదే?॥ 8

ఉ॥ వేయి వచింపనేల? పదివేలు రచింపఁగనేల? నాకు నా
ప్యాయమెసంగఁజేసితి రపారకృపా కవితార్ద్రదృష్టితో
నాయెడఁ బుత్రభావము ఘనంబుగఁ జూపుచుఁ గాన మీకు దీ
ర్ఘాయువు నిచ్చుఁగాతఁ బరమాత్ముఁడు వేంకటరత్నమాంబికా!॥ 9

కృతియఁట భారతిసాక్షా
త్కృతియఁట; కథయఁటసరస్వతీ స్తవమఁట; యా
కృతిఁగొన్నది రత్నాంబా
సతియఁట; నాకింతకంటెసత్కృతిగలదే?॥ 10

ఇట్లుబుధజనవిధేయుఁడు
రామసుబ్బారాయఁడు.

## ధర్మకల్పవల్లి భక్తితత్త్వము

ఉ॥ శ్రీలకుఁ బుట్టినిల్లు కవిశేఖరసంతతి కాటపట్టు స
చ్ఛీలికి వాసయోగ్యము సుధీజనబృందముపట్టుఁగొమ్మ; యు
ద్వేలపరాక్రమంబునకుఁ దెర్వికి విద్యకు నునికిపట్టు; భూ
పాలురకుర్ నిదర్శనము భవ్యము శ్రీజటప్రోలు భూస్థలిన్॥ 1

సీ॥ ఏయమ్మహృదయాబ్జ మేపారుకరుణాల
వాలమై నానాఁడు వరలుచుండు
నేసాధ్వి పతిభక్తి నెనలేనిసౌభాగ్య
కాంతుల నెంతేనిఁ గ్రాలుచుండు
నేతల్లి తా ధరాధీశ్వరియై యశ
మెల్లెడ వెదఁజల్లి యిమ్ముఁగాంచు
నేమాత దానధర్మేప్సితకార్యముల్
సేయుచు మిగులఁ బ్రసిద్ధినొందు

గీ॥ నట్టి శ్రీసురభికుల రత్నాంబ లక్ష్మ
రాడ్విభుసతియై రాణియై ప్రజలఁ బ్రజలఁ
బోలె ననురాగరసమునఁ బ్రోచుచుండుఁ
గొల్లపురిరాజ్యలక్ష్మి కేకొదువలేక॥ 2

సీ॥ పూర్వులపద్ధతిఁ బూనంగఁగాఁబోలుఁ
గవిసంతతిని దయర్ గాంతు వీవు
పూర్వుల సద్భక్తిఁ బోషింపఁగాఁబోలు
దేవకార్యమ్ములఁ దీర్తు వీవు
పూర్వుల సత్కీర్తి భూషింపఁగాఁబోలుఁ
గులధర్మములనెల్ల నిలుపు దీవు
పూర్వుల యాచారముల్ సూపఁగాఁబోలు
నయదయారసముఁ గన్పఱతువీవు

గీ॥ దయయు సత్యంబు ధర్మంబు దాటకుండఁ
బ్రజల నెంతేనిఁ బ్రోవంగఁ బాల్పడిన త్వ
దీయ తత్త్వప్రకాశంబు తేటపడఁగ
రాజ్యపాలన సేయుదు రత్నమాంబ!॥ 3

సీ॥ బీదసాదులఁ బేర్మి నాదరింతువనంగఁ
దల్లి! యిందున్నసత్రమ్మె సాక్షి
విద్యాభిమానంబు పెడ వెప్పుడనంగఁ
బాఠశాలాప్త సత్ప్రతిభ సాక్షి
నిజరాజ్యజనుల మన్నించి కాతువనంగఁ
బ్రజలుసూపెడు రాజభక్తి సాక్షి
పతియాజ్ఞఁ దలఁదాల్చి పాలించెదవనంగ
రాజ్య పాలనకళా ప్రౌఢి సాక్షి

గీ॥ దినదినమున నీరీతి వృద్ధియగుచుండ
భక్తిభావంబు లెంతేనిఁ బరిఢవిల్ల
జ్ఞాన వైరాగ్య సంపత్తిఁ గనుచుఁ దల్లి!
బ్రతుకుమా నూఱువత్సరాల్ ప్రజలకొఱకు॥ 4

ఉ॥ రాజగు లక్ష్మరాడ్విభుఁడు రాగముమీరఁగ నాదరించి, వి
భ్రాజిత వైభవంబు లలరన్ దగనిచ్చి కృతార్థుఁజేసి న
న్నోజఁ గృపామతిన్ సుతుని కొజ్జగఁజేసి ప్రియంబుఁజూపుటన్
రాజిలుచుంటిఁ గొల్లపురరాజ్యమునందున సౌఖ్యలీలలన్॥ 5

చ॥ మఱచితెఱుంగవీవు వినుమా యలలక్ష్మణభూవరుండు నా
దరమువహించి నా కభయదానముఁ జేసెనటంచు వెంటనే
కరమునురక్తి నాయునికిఁ గన్గొనిరమ్మని వ్రాసినారొగిన్
మఱువఁదలంచినన్ మఱువ నాతరమా క్షణకాలమేనియున్॥ 6

ఉ॥ కొల్లపురంబదేడ? ననుఁ గూరిమి భక్తినిఁ బిల్చువేఁడ? నే
నల్లనవచ్చువేఁడ? నను నంతగఁ బ్రేమనుజూచువేఁడ? సం
ఫుల్లముగా మనోంబుజము భూరిధనంబుల నిచ్చువేఁడ? రం
జిల్లఁగఁజే యువేఁడ? గడుఁజిత్రము దైవనియోగ మెంతయున్॥ 7

ఉ॥ కారుణికత్వముల్ గలిగి కాంతలలోపల మేలుబంతివై
ధారుణి సర్వధర్మములు తత్పరతన్ గొని నిర్వహించుటన్
గోరి నుతింతు రెల్లరు నకుంఠితభక్తినిఁ బామకొల్పి శ్రీ
వారి దయాసముద్రము నపారము గాదె ధరాతలమ్మునన్॥ 8

చ॥ విదితమనంబుతోడ నల వేల్పులు సైతము స్తోత్రపాఠముల్
గదుకొనురీతి నిచ్చలును గానముసేయరె? రత్నమాంబికా
హృదయము కోమలం బగుచు నేర్పడఁ జేయునునెప్పుడైన నే
కొదువయులేక భూప్రజలకున్ దగుకీర్తిని గారవించుచున్॥ 9

గీ॥ రాజ కవిరాజ బాంధవ్య మోజ నెఱఁగి
నాదు కవితాప్రచార సందర్భమునకు
రాజపోషకత్వ మొసంగి ప్రభుతమీఱఁ
గరుణతోఁ గాంచుచుండుట ఘనముగాదె?॥ 10

ఉ॥ నాకల మెప్పుడైనఁ దమనామసువర్ణములే లిఖించు న
స్తోకపు భక్తిభావములతోడ వచించు భవత్ప్రభావమున్
వాకొను దేశదేశములఁ బత్రికలన్ బ్రకటింపఁజేసి మీ
శ్రీకమనీయకీర్తులను జెప్పకయుండదు రత్నమాంబికా!॥ 11

ఉ॥ భక్తిఁగలట్టివాఁడ నల బ్రాహ్మణుఁడన్ గవితారసజ్ఞుఁడన్
రక్తిఁగలట్టికావ్యములు వ్రాసెదు నేర్పుఁగలట్టివాఁడ నా
శక్తికొలంది మిమ్మెపుడు శ్రద్ధగఁ గొల్చుచునున్నవాఁడ నా
వ్యక్తిఁగలట్టివాఁడఁ బరుషంబులు పల్కనివాఁడఁ దల్లిరో॥ 12

మ॥ పదునారేండ్లనుండి మీదుకృపకున్ బాత్రుండనై భక్తితో
ముదమారీతిగఁ గొల్చుచుంటినిగదా భూదేవివంచెంచి నన్
బద్దిలంబొప్పఁగఁ జూచుచుంటి రటులే వాత్సల్య మేపార మి
మ్మొదలో నమ్మి భజించుభక్తుఁడను దల్లీ! కావు మెకాలమున్॥ 13

ఉ॥ కంటికిరెప్పవోలె నను గాదిలిపుత్రునిరీతిఁ జూచి మి
న్నంటఁగ నుబ్బురీతి గురుఁడంచును గౌరవమొప్పఁజేసి య
న్నింటను దృప్తుఁజేసితిరి నెచ్చెలితోడ సుతత్రయంబుతో
నుంటి సుఖంబుఁగాంచి తనువుండినదాక భజింతు నమ్మరో॥ 14

మ॥ పదునారేడులనుండి తల్లివలె నాప్రాణంబురక్షించి యా
పదలందున్ గనురెప్పవోలె సతమున్ బ్రాపౌచుఁ బోషించి సం
పదవిరాజిన్ సతిభిక్షపెట్టి సుతులన్ భద్రంబుగాఁజూచి స
మ్మదమొప్పన్ గను రత్నమాంబ కగుతన్ బూర్ణాయురారోగ్యముల్

ఉ॥ ఏనెపుడేగుదెంచెదనొ యిచ్చటి కప్పుడె రత్నలక్ష్మి నా
పై నెనరూని పద్యములువ్రాయఁగఁ బ్రోద్బల మిచ్చుచుండు నీ
మానితభాగ్యమందుటకు మాతృకటాక్షమె యూఁత నాకు మీ
ధ్యానముదక్క వేఱువిషయం బెద కెక్కదు రత్నమాంబికా॥ 16

ఉ॥ వేలకొలంది భూప్రజలప్రీతికిఁ దావలమౌ విధమ్మునన్
బాలనసేయు మీ సుగుణపద్ధతి తోడినృపాలకోటికిన్
శీలమనంగ నిట్టిదని చెప్పెడిరీతిగ నుండె రత్నల
క్ష్మ్యాలయమే నిదర్శనమునయ్యెడు వేంకటరత్నమాంబికా॥ 17

ఉ॥ శ్రీరతనాంబికాసతి వచింపఁగ నేటికిఁ గ్రొత్తఁజేయుచున్
మీరు పరోపకారగుణమే గుణమంచుఁ దలంచుతల్లులై
నారని దైవమన్నఁ గడునమ్మికఁ గాంచినవారలంచు దై
వారిన భక్తితత్పరత వారక పొందినవారలం చొగిన్॥ 18

చ॥ ఎట్టిముహూర్తమందు బుధులెల్లరు దీవనసేయ ధైర్యముల్
నెట్టుచు రత్నలక్ష్మి నిట నేర్పున స్థాపనఁజేసినారొ? మీ
కెట్టికొ అంత లేదుగద; యింతటఁ బౌత్రునిఁగాంచుభాగ్యముల్
గట్టిగనుండె దేవికృపగల్గుటఁజేసి మహాదయమ్మునన్॥ 19

చ॥ వేలకువేలు గుంపులుగ వేడ్కదలిర్పఁగ వచ్చుచుండు రీ
యాలయమన్న నెమ్మనమునం దధికంబగుభక్తియుంట మీ
పాలనమందు సౌఖ్యము నవారిగఁ గాంచుచునుంట మీ దయా
శ్రీలను వీడిపోఁగలరె? చెప్పుము వేంకటరత్నమాంబికా॥ 20

ఉ॥ మీసుకృతంబు గొప్పదిసుమీ పలుమాటలు సెప్పనేటికిన్
భూసురులన్న దైవమన మ్రొక్కుచునుందురు భక్తిపెంపునన్
జేసి దయాస్వభావమని చెప్పకచెప్పును మీమనంబు నే
వీసమునైనఁగాని కనుపింపదు లోపము మీగుణమ్ములన్॥ 21

మ॥ మతిమంతుల్ నుతియింప సొంపలర శ్రీమత్కృష్ణకల్యాణముల్
ప్రతిసంవత్సరమందు మీనగరిలో భాగ్యంబు దైవారఁగా
హితులున్ స్నేహితులున్ బురోహితులు మిమ్మెల్లప్డు దీవింప స
మ్మతిఁ జేయించెదు మీదుధర్మగుణసామ్రాజ్యంబె మిమ్మోముతన్

శా॥ రాజ్ఞీరత్నము రత్నమాంబకృపచేఁ బ్రావీణ్యమేపార లో
కజ్ఞానమ్మును గాంచు యాత్రలకు వేడ్కన్ బోయినాఁడన్ జుమీ
విజ్ఞానమ్మును గాంచు సత్పదవి సత్ప్రేమాన నాకిచ్చె; స
ర్వజ్ఞుం డోముత నట్టిలోకజననిన్ రత్నాంబరాజ్ఞీమణిన్॥ 23

శా॥ సాలగ్రామము విష్ణుపాదసరసీజాతంబు శ్రీవారణా
సీ లింగం బను నొక్కచిత్రపటమున్ శ్రీపాండురంగేశ్వర
శ్రీలీలల్ దలపించు మేల్ప్రతిమయున్ జేతోముదంబొప్పఁగా
వాలాయంబుగ నిచ్చు పుణ్యఫలమే భద్రంబు మీ కిచ్చుతన్॥ 24

చ॥ ఉన్నదివల్కఁ జే, యతిశయోక్తులు కల్పనసేయనొల్ల నా
కొన్నప్రజాళి కన్నము నకుంఠితభక్తినిఁ బెట్టుటన్న నా
పన్నులఁగాచుటన్నఁ గవివర్గముఁ బ్రోచుటయన్నఁ బెద్దగా
నెన్నఁగవచ్చు గొల్లపురమేలెడు శ్రీయుతరత్నమాంబికన్॥

చ॥ మేలగు భక్తిభావమున మీదగుచిత్తము నొప్పు మీకు ల
క్ష్మ్యాలయమే శరీరము తదాశ్రితబింబము రత్నమాంబ; పె
క్కేలవచింపఁగావలయు నెంచఁగ మీకును రత్నలక్ష్మికిన్
బోలికలందు భేదలవమున్ గనుపింపదు నాకు నెయ్యెడన్॥

చ॥ దేనికైనఁగాని వెనుదీయుటలుండునుగాని యెన్నఁడున్
మానరు రత్నలక్ష్మిభజనంబన మాటలుపెక్కులేల? యే
మైననుగాని పీడ రిపుడైనను లక్ష్మిపదాబ్జసేవ లో
మానితరత్నమాంబ! వినుమా కడుధన్యవు ధాత్రిలోపలన్॥

గీ॥ రత్నలక్ష్మి మీలోనఁ దాఁ బ్రబలుచుంటఁ
దలఁచినపుడెల్ల మీకుఁ బ్రత్యక్షమగును
గావలయునన్నఁ బరులకుఁ గానఁబడునె?
యిద్ది మీ పురాకృతపుణ్య మెంచిచూడ॥

చ॥ నీ వల భక్తిభావములు నెక్కొనఁజేసి తదేకదీక్షతో
దేవిపదారవిందము లదేపనిగా భజియించుచుండుటల్
భావితమయ్యె రత్నగిరిలక్ష్మిదయన్ గడియించినావు నీ
కేవిధిఁజూచినన్ గొదువలేమియుఁ గానఁగరావు తల్లిరో॥

గీ॥ జనులపాలిటి కల్పవృక్షంబవీవు
దీనజనసంతతికిఁ గామధేను వీవు
మీదుజటప్రోలురాజ్యలక్ష్మి తసరార
ధరను వర్ధిల్లు మాచంద్రతారకముగ॥

# ఆ రో గ్య భా స్క ర ము.

---

శా॥ ఆరోగ్యాభయరక్షఁ గూర్చి మహితాహ్లాదంబు సేకూర్చి వి
స్తార వ్యాధి తమస్సమూహముల నిస్తారించి మేలెంచు లో
కారాధ్యుండవటంచు నమ్మి సతముఙ్ బ్రార్థించుచునాఁడ మా
శ్రీరత్నాంబకు సౌఖ్యమిచ్చి శుభదృష్టిం జూడు మో భాస్కరా॥ 1

చ॥ అఱువదినాల్గువర్షముల కందఱు నీగతి దేహదార్ఢ్యముఙ్
దరిగినవారలొక్కొ? కడుఁ దత్త్వగుణాంబిక రత్నమాంబ; రా
జ్యరమకుఁ బట్టఁగొమ్మ; పరిజలందఱుఙ్ దలలోనినాల్కగా
వరలెడుతల్లి సౌఖ్యమున వర్ధిలఁజేయుమ లోకనాయకా॥ 2

ఉ॥ లేదనుమాటలేక యవలీలఁగఁ గోరినవారికెల్ల స
మ్మోదమొసంగ నిచ్చుఁ బరిపూర్ణమనమ్మున నాదరించి, సు
శ్రీ దయివారఁజేసి శుభదృష్టినిఁ జూచుఁ బ్రజాళినెల్ల, నీ
వే దయఁజూపఁగావలె నహీనసుఖంబులఁ గూర్చి భాస్కరా॥ 3

ఉ॥ ఎందఱొరాజు లిపుడమి నేలుచునుండిరిగాని యెంచ వా
రందఱికంటె నెక్కుడగునాదృతితోఁ బరిపాలనంబు సే
యం దలపెట్టునంచుఁ గొనియాడుచునుందురు రత్నమాంబ నే
చందమునందునైన సుఖసంపద లాయమకిమ్ము భాస్కరా॥ 4

గీ॥ ఒక్కనాఁడైనఁ గోపింపనొల్లనట్టి
సరళహృదయంబుఁ దాల్చిన సాధ్వి సుమ్మ
ప్రజలఁ బ్రజవోలెఁ జూచెడురాజ్ఞిసుమ్మ
వరలఁజేయుమ సౌఖ్యంబు భాస్కరుండ॥ 5

గీ॥ కన్నబిడ్డలకన్నను మిన్నగాఁగ
గారవించును మా ధర్మకల్పవల్లి
ప్రాజ్యగుణముల గోవు మా రత్నమాంబ
ప్రథితిసౌఖ్యమ్ముఁ గూర్చు మో భాస్కరుండ॥ 6

గీ॥ కవిజనంబులపాలిటి కల్పకంబు
భక్తజనములపాలిటి పారిజాత
మర్థిజనములపాలిటి కాటపట్టు
పరమసౌఖ్యంబుఁ జేకూర్చు భాస్కరుండ॥ 7

ఉ॥ లేచినవెంటనే మొదఁ జలింపనిభక్తిని నిన్నుఁగొల్వఁగా
నోచెదుపుణ్యశీల సుమనోరసదృష్టిని నెల్లవారలన్
జూచెదుమాతి ధర్మగుణసూత్రములెల్ల నెఱుంగుధన్యకున్
నీ చతురత్వ మేర్పడఁగ నీరజమిత్ర! సుఖంబుఁ గూర్చుమా॥ 8

గీ॥ మంచి యారోగ్యభాగ్యంబు మించునట్లు
కలుగఁజేయఁగలాఁడు భాస్కరుఁడె యంచు
నీవ యానవగ్రహములలో వరలెడు
పెద్దవంచు నిన్ గొల్తు మువ్విద్దులందు॥ 9

---

పండరీపుర పాండురంగ ప్రార్థన.

---

గీ॥ రత్నమాంబికాహృదయంబు ప్రబలియుండె
భక్తిగోమత నీయందుఁ బాండురంగ
దూరమనక కష్టమనక భారమనక
వచ్చుచుండు నిన్గనఁ బ్రతివత్సరంబు॥ 1

ఉ॥ వచ్చుటెకాక పాటఁగొనివచ్చును భక్తనికాయమెల్ల, వి
ద్వచ్చయమున్ గవీంద్రులను దద్దయుభక్తిగఁ దోడితెచ్చు, నీ
సచ్చరిత ప్రభావము నె చాలఁగఁ జెప్పు ననారతంబు నిన్
మెచ్చని వేళ లేదు, కనుమీ రతనాంబను బాండురంగఁడా॥ 2

మ॥ ఉదయంబందున లేచినంతటనె యత్యుత్సాహమే పార నీ
పదపద్మంబులె సంస్మరించు నెపుడున్ భక్తిప్రభావంబు లోఁ
బొదలన్ స్నానముఁజేసి నీభజనమే మున్ముందు సేయుంగదా
యెద నూహించి యనుగ్రహింపుమిఁకఁ దండ్రీ పాండురంగేశ్వరా॥ 3

నిన్నెద సంస్మరించుటలు నీపదపద్మముఁ గొల్చుచుండుటల్
తిన్ననివాగ్విలాసములు దీర్చి భవన్మహిమంబుఁ జెప్పుటల్
కన్నన నీస్వరూపమును గాంచి భజించుటలున్ మహేశ్వరా
యెన్నఁడు సేయకుండ భుజియింపఁగనొల్లదు నిక్కవంబుగన్॥ 4

ఎప్పుడు నీమహామహిమయే తలపోయుచునుండు రాత్రులం
దెప్పుడునైన నిన్ను స్మరియింపక నిద్రకు మేనువాల్చఁబోఁ,
దెప్పుడు నెందుఁబోయిన మహేశుఁడవంచెద నిన్నె ముందుగాఁ
దప్పక యెంచి తక్కఁగలదైవములన్ భజియించు నావలన్॥ 5

పెంచుచునుండె భూప్రజల బిడ్డలఁబోలె దయార్ద్రచిత్తయై
మంచుచునుండె భూసురుల మాన్యములిచ్చి బహూకరించుచున్
నించుచునుండె నద్రిశిల నిశ్చలతత్త్వము కీర్తికాంతిచే
సంచితపుణ్యశీల రతనాంబ సుఖింపఁగఁజేయు విశ్వేశ్వరా॥ 6

## శ్రీ రత్నలక్ష్మీ స్తవము.

గీ॥ భక్తియన్న రత్నాంబ కాసక్తి మెండు
భక్తులన్న రత్నాంబ దైవముగఁ జూచు
భక్తిగలచోట రాజ్ఞి కన్పడుచునుండుఁ
బ్రథిత భక్తిస్వరూపంబు రాజ్ఞియగుట॥ 1

గీ॥ పరులకష్టాలఁ బాల్గొను సురభిరాజ్ఞి
భక్తియన్నను ముందంజవైచు తల్లి
దేవకార్యమ్ముల ననురక్తియును జూపు
రాజ్ఞి నెవ్వేళఁ బ్రోవుమా రత్నలక్ష్మి॥ 2

గీ॥ కొల్లపురిప్రజలన్నను గూర్మిఁజూపి
సీటివసతినిఁ గల్పించి నెగడునట్టి
మాత; యెల్లసంస్థలకుఁ జేయూతనిచ్చుఁ,
గానఁబో యిట్టితల్లి నెందైనఁగాని॥ 3

గీ॥ విద్యపై నభిమాన మెవ్వేళఁ జూపు
బీదబాలురన్నను గనిపెట్టుచుండు
నన్నవస్త్రంబు లిచ్చు లేదన్నమాట
లేక రత్నమాంబికను బాలింపుమమ్మ॥ 4

గీ॥ భద్రగిరివాసులకు సదుపాయ మొసఁగ
సీటివసతిఁ గల్పించె రాజ్ఞీమతల్లి
యెల్లవారినిఁ బోషించుఁ గృపవహించి
ప్రాపు రత్నాంబ కీవయే రత్నలక్ష్మి॥ 5

గీ॥ నిన్నుఁగాదని యేపని నెన్నఁడైనఁ
జేసి యెఱఁగని సాధ్వి రాజ్ఞీమతల్లి
కార్యఫల మెన్నఁడైనను గాంక్ష సేయ
నట్టి ధన్య మా శ్రీరత్నమాంబ సుమ్మ॥ 6

కారము నేగఁబోవుతరిఁ దోరపుభక్తినిఁ బాదుకొల్పుచున్
మంతులిచ్చి నీపదములందున వ్రాలి విధేయుతన్ నమ
స్కారముఁజేసి నీసెలవుఁ గైకొనిగాని ప్రయాణకార్యమున్
శ్రీరతనాంబ యెన్నఁడును జేసియెఱుంగదు రత్నలక్ష్మిరో॥ 7

నీదగు నీవ్రతంబనిన నీభజనంబన నీజపంబనన్
నీవరపూజలన్నఁ గడునిష్ఠమెయిన్ నెఱవేర్చుచుండు, సం
భావితమైన చిత్తమును వర్తిలఁజేసి సమస్తమన్న నీ
సేవయటంచు నెంచుఁగద శ్రీరతనాంబకు నిమ్ము సౌఖ్యముల్॥ 8

గీ॥ నీవ రాజ్యలక్ష్మివని గణించు నెపుడు
నీ కృపారసదృష్టియే నిత్యమనుచు
సంస్తవముఁ జేయుచుండు నీజాడ లరసి
భార మోరత్నలక్ష్మి నీపైన నుంచె॥ 9

గీ॥ దానధర్మంబు లెవ్వేళ మానకుండ
నీ సమీపమ్మునందె సన్నియతి నిల్చి
పలుపుచుండుట నీ కొక్కసాక్షిగాదె?
తల్లిహృదయంబె నీకు నిదర్శనంబు॥ 10

గీ॥ స్వార్థమున కెట్టిసమయాననైన నిన్ను
నెయ్యెడలనైన నిసుమంతయేనిఁ గోర
నట్టి గుణధన్య మారత్నమాంబ యంచు
నీ వెఱుఁగరాని విషయంబె? దేవి చెపుము॥ 11

గీ॥ పౌత్రలాభంబు నీవల్లఁ బడయుటకును
మంచిసౌఖ్యంబు నీవల్ల మించుటకును
గాదె నిన్గొల్చుచుండు నెక్కాలమందు
రత్నమాంబకు నీవయే ప్రాణమంబ॥ 12

నమ్మినదేవి వంచు నినునమ్మిన లోపలవాంబు రాదటం
చెమ్మెయినైనఁగాని కృపయేర్పడఁ జూచెదవంచు నీపయిన్
ముమ్మరమైన భక్తిరసమున్ గుఱియించుచు రత్నమాంబ యో
యమ్మ నినున్ భజించును గదమ్మ సుఖాంబుధి రత్నలక్ష్మిరో॥ 13
నమ్మినభక్తులన్ విడుచునాయని కాదె భజించు నీపయిన్
నమ్మిక మెక్కుడుంచి; తగునా? ఇట్టు లారడిసేయుచుంట లో
యమ్మ దయాంబురాశివిగదమ్మ కరంబనురక్తిసూపి సౌ
ఖ్యమ్మును గూర్చి యీయఁగదవమ్మ చిరాయువు రత్నమాంబకున్॥

ఉ॥ నీకయి దేవళంబిడియె, నిష్ఠవహించుచు నిత్యపూజలన్
నీ కొగి సేయు బ్రాహ్మణుల నిల్పెను, బర్వదినంబులందు స
త్ప్రకట భక్తిభావ మలరన్ భజియించు భవత్పదాబ్జముల్
చేకురఁజేయుమా సుఖము శ్రీయుత వేంకటరత్నమాంబకున్॥ 15

శా॥ శ్రీరమ్యాకృతి నీమహాకృతియె ధాత్రీధర్మ రక్షాక్రియా
పారీణంబని నమ్మి నీచరణసేవల్ సేయఁగా నెంచి రా
జ్ఞీరత్నాంబిక నీకు దేవళముఁ గూర్చెన్ గాన నెల్లప్పుడున్
శ్రీరంజిల్లఁగ నేలు రత్నగిరిలక్ష్మీ! ప్రాజ్య తద్రాజ్యమున్॥ 16

శా॥ నీవేదిక్కని రత్నమాంబ ధృతిమై నీనామ మేపారఁగా
భావంబందున భక్తిభావమలరన్ భావించి, మంత్రంబనన్
గావించున్ జప, ముద్ధరించి జనులన్ గాపాడి రక్షింతువం
చే వేళన్ మదినమ్మి; రత్నగిరిలక్ష్మి తీర్చు తద్వాంఛలన్॥ 17

మ॥ ధనమన్నన్ వ్రతమన్న నీవ యనుచున్ ధ్యానించు నిన్నెప్డు, నీ
కనికారం బొకఁడున్నఁ జాలుననుచున్ గావించు స్తోత్రంబు, నీ
[illegible] ప్రాణమునైన నిచ్చుఁగద రత్నాంబామహారాజ్ఞి యే
మని వర్ణింపఁగలాఁడ నీమహిమ మంబా రత్నలక్ష్మ్యంబికా॥ 18

---

## నా గ రా జ స్తు తి.

---

ఉ॥ తల్లినిఁబోలి గర్భమునఁదాచి ప్రజాళినిఁ గాచుతల్లికిన్
గొల్లలుగాఁగ దీనజనకోటికిఁ గామ్యము లీయఁజాలు దీ
వ్యల్లతికామతల్లికి గుణాఢ్యుఁ డనందగు నొక్కపౌత్రునిన్
జల్లఁగనిచ్చి కన్నులను జల్లఁగఁజేయుమ నాగరాజమా॥ 1

ఉ॥ శాశ్వతమైన సత్కృతులు సల్పెను శ్రీయుతరత్నమాంబ, యీ
విశ్వమునందుఁ బేరుఁగొను వీరగుణాఢ్యుని నొక్కపౌత్రునిన్
శశ్వదనంతకీర్తి పటుసంపదఁ గాంచెడువానిఁ గాంచ నా
గేశ్వర యట్టిభాగ్యమును నిమ్మ కరంబు ముదంబుగల్గఁగన్॥ 2

ఉ॥ ఈ యుబలాటసంద్రమును నీదుట యెన్నడొ యాత్మచింతలన్
బాయుట యెన్నడో తొలితపంబులు పండుట యెన్నడో యటం
చాయతభక్తితోడ రతనాంబ నిరంతరమున్ దపించు; నీ
వే యవతారమై సురభివృక్షముఁ బ్రోవుమ నాగరాజమా॥ 3

చ॥ కర మనురక్తితో హృదయకంజమునందున నెంచి పండరీ
పురమున నిన్ను నిల్పఁగద పూజలొనర్చి విశేషదానముల్
జరపుచు నేడు కొల్లపురసంతతిఁ జూడఁగ నిత్య భక్తిమై
మఱల భజించు బ్రాహ్మణసమాజము మెచ్చఁగ నాగరాజమా 4

ఉ॥ కాదనరాదు నిన్ గొలువఁగా నయమారఁగ వేడుచుండఁగా
లేదనరాదు రాజ్ఞియును లేచినదాది తదేకభక్తి సం
పాదనఁజేసి నీదు పదపద్మము నింతగఁ గొల్చుచుండఁగా
వాద మొకింతలేక కులవర్ధను నీఁగదె నాగరాజమా॥ 5

## శ్రీజటప్రోలు మదనగోపాలాష్టకము.

గీ॥ చదువటన్నను జపమన్న సంధ్యయన్న
వ్రతమటన్నను శ్రుతిహిత క్రతువటన్న
నీవ; నిజమింత; జటప్రోలునీరజాక్ష!
ప్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 1

గీ॥ నడచుచున్నను గూర్చున్న నడలియున్న
నిద్రఁగొన్నను మేల్కొన్న నిలిచియున్న
నిన్ను మనసార నెవ్వేళ నెన్నుచుందుఁ
బ్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 2

గీ॥ వార్చుచున్నను వినుచున్న వ్రాయుచున్నఁ
బలుకుచున్నను దినుచున్న బడలియున్న
నిన్నె దృఢభక్తి నెంచి వర్ణించుచుందుఁ
బ్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 3

గీ॥ యాత్రలన్నను దీర్థంబులన్న స్నాన
మన్న సత్కృతియన్నను ధ్యానమన్న
నీపదాంబుజసేవగా నెమ్మిఁ దలఁతుఁ
బ్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 4

గీ॥ పుణ్యమన్నను గాయత్రిపూజలన్న
ముక్తియన్నను హరికథాసక్తియన్న
నీదు దివ్యగాథామృతాస్వాదనంబె
ప్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 5

గీ॥ భాగ్యమన్నను నారోగ్యఫలమటన్నఁ
జిత్తశుద్ధియటన్న వాక్సిద్ధియన్న
నీ చరిత్రలాకర్ణించు నెయ్యమొకటె
ప్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 6

గీ॥ కీర్తియన్నను గాంతివిస్ఫూర్తియన్నఁ
బ్రీతిభయన్న వేయేల; సర్వస్వమన్న
నీదు కరుణాకటాక్ష సన్నియతిగాదె?
ప్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 7

గీ॥ మాతయన్నను బితయన్న భ్రాతయన్న
మిత్రుఁడన్నను గురుఁడన్న మేటియన్న
దైవమన్న నేడ్గడయన్న నీవ; యన్న!
ప్రహతసుజనార్తి! మదనగోపాలమూర్తి!॥ 8

## తొలిపలుకు.

---

శ్రీ శారదాస్థాన విశాలరంగమున నీరదోదర విద్యుదఖండశుభ్రరుచిఁగన్న శారదాదేవి పరమకల్యాణవిలాసస్వరూప మ్మహర్నిశలు సాహితీసాగరవీచికాడోలికల నూగు విమలవిద్యారాజహంసముల మానసారామవీథుల తరుణసుందరసుమశయ్యల నిలిచి యుదంచిత భావసామ్రాజ్య పట్టభద్రయై యంతిపురినుండి లక్ష్మీవిలాస వైభవోపేతము లైన ప్రభుప్రాసాద నిర్మలగంగాప్రవాహావగాహములఁ గలకఁదేరి బయలికొలువున నిల్వనేర్చును.

బహిరంతరముల నల్వంకల నలరారునలువరాణికలరూపు కవితాలతాంగి ప్రసన్నకపోలబింబములఁ బ్రతిబింబించుటయుఁ బారవశ్యమున నిరంతరధ్యానయుక్తి స్వప్నవీథుల నంతరంగముల విన్యాసముంగూర్చుటయు ననుఁగ్రొత్తవిలాస మనఁజెల్లదు. అట్లని యది కవిపదమ్మనుగ మించు సర్వజనసాధారణ మనోధర్మమని యనఁజాలము. అటనట విరళవిరళమ్మయి యావెలుగుదారులఁ బలుకుందొయ్యలి పులకించి, చిగురించి, పుష్పించి ఫలవంతమగుట గలలోనివార్తయని నిరసించినంత మాత్ర నాగీర్వాణికరకంకణనిక్వణమ్ములు మొలనూలిమగరాలనీలనీరదమ్ములు మంజుమంజీరనినదమ్ములు నంతకునిమ్మళ్ళు విద్రుమోదరమౌక్తికదరహాసచంద్రికల నెరఁజిమ్ము ముఖచంద్ర కాసారకమనీయనీలోత్పల తారకానికర దృక్ప్రసారమ్ము లెవరుకాదననేర్తురు?

ధర్మకల్పవల్లి శ్రీమంతు మహారాజ్ఞీ శ్రీసురభి వేంకటరత్నమాంబాకృపాకటాక్షవీక్షణాసేచమాలికా ధారాసారమ్ము, వేవిధముల నాతపతాపార్తి వోనాడఁ గవిరాట్ శ్రీ రామసుబ్బరాయని స్వప్నారామకల్పవేది నవనవోన్మేషతారుణ్యవతియై నిండుకొలువున "సకలసద్గుణనికురుంబశారదాంబ" నాఁగాదననేరుసాహసింతురు? సాహసించి కల్ల

లాడుపాప మేసుకృతి కట్టుకొనోపు? శాస్త్రమర్యాద నమోఘుంబగు "అహంగ్రహ" మను నుత్తమోపాసనాకలన శ్రీ సురభికులరత్న రత్నమాంబారాజ్ఞీమతల్లి స్వీయహృద్వీణాతంతువుల కమనీయగాత్రములం బలికించు చతుర్ముఖు చతురశారదకు శ్రీవాజపేయయాయజూకకులరత్నమై బ్రహ్మపరమార్థదర్శనుండై యస్మన్మిత్రచూడామణియైన శ్రీరామసుబ్బరాయని వాఙ్మధురానందనారామ సుమమాలికాకృతుల బయలికి ల్విచ్చి తిరిగి తద్రూప మామోదకావ్యకుసుమస్వరూపమ్మునం దవయంకితమ్మునంగూర్చుకొని యాంతరస్థితి నిలుపంగన్న యాయనూనపథమ్ము నేరు కొనియాడ నేర్తురు?

నియమయుక్తి చలువలీను కపురంపుంబలుకు పూసెజ్జ నను మేను వ్రాల్పంగన్న యీ భారతీసాక్షాత్కారక్రమస్వరూపమ్ము భక్తిపరతంత్రుండనై వినంగనంగాంచి యీయాకృతికన్నియకుం దనయాస్థానమ్మునంతికమ్మునం దనయాస్థానమ్మున గల్పించి సాంక నిందువయసునఁగైకొన్న శ్రీవారి కీకమనీయాకృతిం గన్నతల్లి కన్నతల్లి కనల్పసేవల నలపుందీర్ప శ్రద్ధంగాంచుమని బుద్ధిం గఱపి దీవించి యనుజ్ఞ గైకొందు.

విద్వాన్, విద్వత్కవిరాజ
సంపల్లి. విశ్వనాథశాస్త్రిగారు. ఎం. ఏ.
నైజాంకాలేజీపండితులు.

విశ్వసుందర లేఖ.

శ్రీ రాజా నాగ్రదేవ విశ్వసుందర రావు బహద్దరువారు.
శ్రీ నేగాయమ్న జమీందారులు.

శ్రీ శారదాదేవి ప్రత్యక్షము విప్పనూవహామే యైనను మీబోంట్లకది విరుద్ధముగాదు. సర్వదా మీరు తద్దేవీకటాక్షమునకుం బాత్రులనియే నాయభిప్రాయము. అట్టితరి విద్యాప్రాభవులును నిష్కళంకహృదయులునునగు మీకుందక్క మఱెవరికామె ప్రత్యక్షమగును? ఇతరుల కల

భ్యమైనను మీకదియసంభవము కాఁజాలదు. పూర్వకవివర్యులఁగూర్చి మనకువినవచ్చునుదంతములును బూటకములుకావు. సర్వకారణుఁడగు నాపరబ్రహ్మయే మనయెడ నధిష్ఠితుఁడైయున్నప్పు డతని యంగకృత ములగు నిట్టి వాశ్చర్యదాయకములైనను నబద్ధము లెన్నఁటికిని కాఁజా లవు. జగల్లీలాప్రసారుఁడగు పరమాత్ముని కశక్యం బేదియు నుండఁజాల దుకదా? ఆసరస్వతీప్రత్యక్షకరుణాకటాక్షులై మీరురచించిపంపిన పద్య ములను వానిధారయు నత్యంతమోదావహములై నన్ను సంతోషమున మునుంగఁజేసినవి. ప్రకృతిసిద్ధముగ నీవఱకే మీకవితా కన్యకాలావ ణ్యము న న్నాకర్షితచిత్తుఁ జేసియున్నవా ర్త మీకుఁ గ్రొత్తగాదు. భగ వంతుఁడు మీ యభివృద్ధికిఁ దోడ్పడుఁగాక.

---

## తత్త్వనివేదిక.

శ్లో॥ శ్రేయ స్తే విదధాతు శారదశశిశ్రీభాసురా భాసురా
ధారాసార నిరాసకారి మధురవ్యాహారిణీ హారిణీ
ముక్తాభూషణపోషణ స్మితలవశ్రీసాధునా సాధునా
లావణ్యేన నిజేన నిర్జితవతీ రంభారతీ భారతీ।

లోకమున భాషావ్యవహారముతో వివిధపురుషార్థములను సా ధించు సకలమానవకోటికి శ్రీభారతీప్రసాదము జీవనౌషధమని యెల్లర కుఁ దేటతెల్లము. అది పూర్వపుణ్యాలభ్యమగుట సార్వజనీనము. ఇకా లమునఁ గొందఱుమహాకవులుమాత్రము స్వప్నమున భారతీదర్శనాలా పాదులను బడసిరని కొన్నిప్రబంధములవలనఁ దెలియుచున్నది. అందుఁ బ్రబోధదర్శనమరుదు. ఈకవిపుంగవునకు శ్రీభారతీదేవి స్వస్థాపనదివ్యదివ సమున నిజాకృతిని సాక్షాత్కృతినిఁ గావింపఁజేయుటయేకాక విద్వజ్జగ జ్జేగీయమానయశస్కులగు శ్రీవేంకటలక్ష్మారాయ ప్రభువులచే నూరార్ల చే బహూకృతమై సరస్వతీలీలావాలమై కొన్నిమాసములనుండికాన్పింపని

విద్వత్పాషధమగు నైషధకావ్యమును దృశ్యముగఁజేసి స్వయముదృశ్య రాలైనదనుట యలోకసామాన్యమైనను నియ్యది ప్రబోధసమయ జనిత మగుటచే విద్వదాస్తికశిఖామణులు నిక్కమని వక్కాణింపక తప్పదు. ఇందు "అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే" అను ప్రమాణమే యీ **సికవిద్వ**ల్లోక శరణ్యము- కానసే "ఆంధ్రత్వమాంధ్రభాషాచ ఆంధ్రదేశసముద్భవః త్రియంతు దుర్లభం లోకే నాల్పస్య తపసః ఫలమ్" అనునార్యోక్తికి నుదాహార్యుఁడై పారాశర్యగోత్రాలంకృతి సుకృతివంశోద్భూతి గోప్పదానుభూతి సురభిరాజాబహూకృతి శతాధికగ్రంథరచనా సమున్నతి స్నేహాలతాకవితాసంఘవిస్తృతి మున్నగుసుగుణసంతతి గల యీకవిచంద్రునకు భారతీదేవి సాక్షాత్కారము సాజము-

తదాదిగా శ్రీభారతీదేవి యీకవిపుంగవుని చెంతఁ జేరి సుప్రసన్నయై దినదినప్రవర్ధమాన స్వీయలీలావిలాస రసభావాదులను భాషాప్రపంచమున వెల్లడింపఁజేయుచున్న దనుటలో నిటీవల నీకవిసింహుఁడు రచించినకృతులే ప్రమాణములు- అందు భారతీసాక్షాత్కారమనుకృతి మొదటిది. శ్లేషమాధుర్యాది శబ్దార్థగుణగరిష్ఠమై వైదర్భ్యాదిరీతి పటిష్ఠమై, యనుప్రాస స్వభావోక్త్యాది శబ్దార్థాలంకార ప్రదర్శిష్ఠమై భారత్యాదివృత్తి వరిష్ఠమై, వివిధరసభావ భూయిష్ఠమై శ్రీసాధ్వీ రాజ్ఞీమణి వేంకటరత్నమాంబికాంకితాలంకృతమై శ్రీ రాజా వేంకటజగన్నాథరాయ ప్రేరితమై శ్రీసరస్వతీదేవ్యనుమోదితమై, సుబ్రహ్మణ్యవిరచితమై క్షణక్షణానేకాక్షరధారా లేఖినీలిఖితమై భాసిల్లు పవిత్రమగు నీభారతీసాక్షాత్కారకృతి సకలకలావిలాసినియగు భారతీదేవి సాక్షాదాకృతియై సహృదయ హృదయనిర్మలఫలకములలోఁ బ్రతిఫలించి సమస్తశ్రేయోదాయకమై విలసిల్లుఁగాత.

శిరోమణి, పల్లా చంద్రశేఖరశాస్త్రి గారు,
శ్రీ జయపురీలు సంస్థానపండితులు.

## పండితాభిప్రాయములు.

---

మ॥ కలలో భారతి దివ్యదర్శన మిలన్ గన్నారఁగాఁ గాంచువా
రలు పూర్వాంధ్రకవీంద్రులందుఁ గల రార్యా! యెంతధన్యుండవో
కలికాలంబున భారతీచరణసాక్షాత్కారభాగ్యంబు ని
స్తులపుణ్యంబున నీకుఁ జేకురె నటంచున్ నేను భావించెదన్॥ 1

మ॥ చిరకాలంబుననుండి భారతిని సంసేవించుభాగ్యంబు చే
కురె, స్వప్నంబున దర్శనంబొసఁగె నీకున్, ధన్యతన్ గాంచె నీ
సరసాంధ్రోక్తిమయప్రపంచము, భవజ్జన్మంబు పుణ్యౌఘబం
ధురమయ్యెన్, జిరజీవివై కృతులయందున్ నేర్పుఁజూపింపుమా॥ 2

శా॥ నానాభూషణభూషితాంగియయి యానందంబుతో వచ్చి నీ
పైనన్ దివ్యకటాక్షవీక్షణసుధావర్షంబు వర్షించెనా?
యానందంబున నల్వరాణి యిఁక భాగ్యంబన్న నీదేసుమా
తేనెల్ జాల్గొనఁజాలు నీకవిత తోడ్తెచ్చెన్ జుమీ భారతిన్॥ 3

సీ॥ సురభిలక్ష్మణరాయ నరపాలతిలకంబు
నెలవిఁ బ్రాస్థానమం దలరఁజేసె
నాఁడితప్పనితల్లియగు రత్నమారాజ్ఞి
గారాబుకొడుకుగా గారవించె
నపరసరస్వతియైన యిన్గంటిస
రస్వతి కనుదయారసమునింపె
శ్రీజగన్నాథరాట్శేఖరుం డనురాగ
దృష్టితో లోటులఁ దీర్చుచుండెఁ
గీ॥ బలుకుఁబూఁబోఁడి కలలోనఁ బలుకరించి
కుశలసంప్రశ్న మొనరించి కూర్మిఁజూపెఁ

గొఱత నీ కెందులేదు నీ విరచితాంధ్ర
కృతులు శ్రీభారతికి నలంకృతులు సఖుఁడ.। 4

క॥ పువులన్ గ్రుచ్చెడిపోలికఁ। జవిగాఁ బద్యములఁగూర్చి సత్కవిలోక
శ్రవణాలంకృతి। సల్పెడు కవికిన్ నీ కగుత నిత్యకల్యాణంబుల్॥ 5

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీః

---

మ॥ అతులానందముఁ గూర్చె మాకుఁ గవిరాయా! రామసుబ్రాయ! భా
రతి స్వప్నంబునఁదోచి నీ కభిమతార్థంబిచ్చి మన్నించె; నీ
గతి సాక్షాత్కృతి మున్ను పోతనకు దక్కంబోలు, నేఁ డీవు గాం
చితి వున్నట్టులెయుండి; యింతటితపశ్శ్రీ యెట్లు సాధించితో!॥ 1

మ॥ కవితా సంతతయజ్ఞ దీక్షితుఁడవై కావ్యంబులన్ వ్రాసినాఁ
డవు- సంధ్యానట దంబికారమణ జూటా ఘుంఘుమ ద్గాంగ భం
గ విలోల త్కుముదాబ్జగంధలహరీ గర్భామృతాంశుప్రభా
స్త్రవనీయంబుల భారతీ చరణపూజా పుష్పగుచ్ఛంబులన్॥ 2

మ॥ చతురోదారములైన నీకృతులలో సంస్తుత్యమై యొప్పు భా
రతిసాక్షాత్కృతి; ధర్మకల్పలతయా రత్నాంబికాదేవి కం
కితమై యయ్యది కేతకీపరిమళోత్కృష్టోరుసౌవర్ణమై
క్షితి రాణించుఁ ద్వదీయ దివ్యకవితాశ్రీలన్ గుబాళించుచున్॥ 3

చ॥ కలమును జేతఁబట్టి క్షణకాలము ధ్యానముఁ జేయునంతలో
పల నవభావకల్పనలు భవ్యపదార్థము లేకధారగా
జలజల నూటకాల్వవలె సాగుచు బారులుదీరుఁ జంపకో
త్పల ముఖ పద్యపంక్తు; లిది భారతినాట్యమొ! నీకవిత్వమో!॥ 4

మ॥ నిను నాస్థానకవీంద్రుఁగా గురువుగా నెమ్మిన్ జటప్రోలు భూ
జననాథుండును రత్నమాంబికయుఁ బూజ్యస్థాన సమ్మాన భా
జనముల్ జేయుట భాగ్యమయ్యె; సుయశస్సౌభాగ్యసంపత్తులన్
నిను వారిన్ దనియించి వాణి కవితానిత్యోత్సవం బీవుతన్॥ 6

మహాకవి, కవితావసంత, కవితాచతురానన,
కవిసింహ, అవధానిపంచానన,
విద్వాన్, గడియారము వేంకటశేషశాస్త్రిగారు.

---

సోదరకవిలేఖ.

వాజపేయయాజుల వేంకటనారాయణ.

శా॥ శ్రీవాణీ గిరిజా మనోహర దయాక్షీరాబ్ధి నోలాడుచున్
జేవల్మీఁ గవిత్వమల్లుచు యశశ్శ్రీ వృద్ధిఁగావించుచున్,
దేవబ్రాహ్మణ భక్తితత్పర ధరాధీశోత్తమాస్థానమం
దావిఖ్యాతసుఖోన్నతిం జెలఁగెదే! యన్నా! సరోజాక్షితోన్॥ 1

మ॥ విను మన్నా! మనవంశమందుఁగవియై విశ్వంభరాధీశులన్
గని యెవ్వారును గీర్తినందని యపఖ్యాతిన్ మనీషాబలం
బునఁ బోఁగొట్టఁగఁ బుట్టినాఁడవని నే బుద్ధిన్ దలంతున్ నిజం
బనుకోన్నన్ సరె మానినన్ సరె భవత్సాన్వంతంబునం జెంతయున్॥ 2

సీ॥ పుట్టిన యింటికి మెట్టినయింటికి
వన్నె దెచ్చె నేవారిజాక్షి
తనదు పాతివ్రత్యమును సాధ్వీలానన
సేవించె మగని నేచెలువ మున్న
గాసినవా సోదైన్య నాశంబుఁగావించి
పోషించుఁ బ్రజల నేపుణ్యశీల
యాత్మజావిధమున నాదరంబున నిన్ను
ననిశంబుఁ బ్రోచు నేయనులహృదయ

గీ॥ యట్టిగుణధన్య కాంతాజనాగ్రగణ్య
పతిపదాంభోజ మకరందపానలోల
రమ్యరోలంబ వేంకటరత్నమాంబ
సుఖముగానున్నదే? రామసుబ్బరాయ!॥ 3

మ॥ విలసద్భక్తిఁ జరించి నేర్చుకొనునే విద్దెల్ జగన్నాథరా
యలు నీయొద్ద నిరంతరం బతులదేహారోగ్యసంపన్నుఁడై
బలముం బుద్ధిబలంబు నీతిబలముం బాండిత్యవిస్ఫూర్తియుం
బలముం జెందునె? నాఁడునాఁటికి ధరాపాలార్భకుల్ మెచ్చఁగం॥ 4

చ॥ తిరిగితి వెల్లదేశముల ధీరులు సూరులు సత్కవీశ్వరుల్
వెఱగుపడం జరించితివి; విశ్వజనస్తవనీయ సద్గుణా
కరుఁడను పేరుగాంచితివి; గండరగండఁడ వౌదువైన భూ
వరసభయందు నెట్లు మనవంశము వాసికినెక్కఁ గాలెదో॥ 5

శా॥ అందెన్నిదగు లేఖ నాకుఁ బరమాహ్లాదంబు సంధిల్లె నా
యందున్నీకుఁ గలట్టియాదరము నెయ్యం బెంతయుం వర్ణ్యముల్
పొందయ్యెం వినువారివీనులకు నీవిన్నాణపుంబద్దెముల్
సందేహం బొకయింత లేదు ధిషణా సంపన్న విద్వన్నుతా॥ 6

గీ॥ కమ్మగాదు సుధాకలశమ్ముగాని
జాబుగా దది పేరిమిగాబుగాని
లేకగా దది నెయ్యంపువాకగాని
బాపురే దానివర్ణింప బ్రహ్మతరమె?॥

మ॥ బలవంతుండవు బుద్ధిమంతుఁడవు సత్పాండిత్యమే యూఁతగాఁ
గల కవ్యగ్రణి వృత్తమోత్తమధరాకాంతార్భకుల్ నిన్ను ని
చ్చలుఁ బూజింతురు సద్గుణుండవనుచుం సౌశీల్య సౌహార్దని
ర్మల శోభాత్రిపయోధి విట్టినిను సమ్మానింపఁగాఁ జెల్లదే?॥ 8

ఉ॥ నీవలె నెల్లదేశముల నేరుపువిహారఁ జరింపలేదు, శి
ష్యావళి కక్షతందాలిచి యవ్యయవిద్య లొసంగ లేదు, వా
గ్దేవికిఁ బద్యరత్నమయ దివ్యవిభూషలఁ బెట్టలేదు, వి
ద్యావిదులైనసజ్జనుల నాదృతి నందఁగలేదు, సత్కవీ!॥ 9

చ॥ పలుకళ లభ్యసించి పలుపండితసింహులు రాజచంద్రులున్
బలుసుకవిప్రకాండులును బల్వురు బుద్ధివిశేషధుర్యులున్
బలు సుజనాగ్రగణ్యులు సెబాసని మెచ్చఁ జరించినట్టి నీ
వలసుని నన్ను మెచ్చికొనన్యాయమొ? ధర్మమొ? చెప్పు మగ్రజా॥ 10

చ॥ వయసున నీకునాకుఁగలవాఁ డిసుమంతయెగాని విద్యలన్
నయమున బుద్ధివైభవమునన్ బితృభక్తిని దైవభక్తి నా
శయముల ధైర్యసంపదను శాంతిని దాంతిని జ్ఞానమందు ని
శ్చయముగ వార హెచ్చగును సత్యము సత్యము సత్య మగ్రజా॥ 11

ఆ॥ వె॥ వాజపేయయాజివంశంబు మును వేద
జడము శాస్త్రకర్కశంబె గాని
కవన లలితమాను కాంతాశిరోమణి
వదినెవలన నేఁడు వాస్తవంబు 12

ఆ॥ వె॥ వాజపేయయాజివంశోద్భవుఁడు రామ 
సుబ్బరాయఁడన్న సుకవిసార్వ
భౌముఁడంచు నెల్లవారలు వాకొన 
నాలకించు భాగ్య మబ్బుఁగాక॥

సీ॥ జ్ఞాతివర్గంబు నీఖ్యాతి నాకర్ణించి
యమితసంతోషము నందుఁగాక
వైరివారంబు నీపేరు విన్నంత న
త్యంతవిషాదంబు నందుఁగాక

స్వర్గమేగిన నీదుజనకుండు నీవాసి
నాలించి యానంద మందుఁగాక
నిన్నుఁ జేపట్టిన నెలఁతకు నీకీర్తి
యవతంసమల్లిక యగునుగాక
గీ॥ తలఁచి తనయంతఁదాన కౌఁగిలియొసంగు
కవనకాంతకు దూరమై కష్టపడుచు
కుములు మాబోంట్లసచ్చిత్తకుముదములకు
నిండుజాబిల్లియగుఁగాక నీయశంబు॥ 14

చ॥ కలదుగదా మదగ్రజనికావ్యసతీమణి మాపురంబునన్
వెలయుఁగదా జగంబున నభేదము తమ్ముని కన్నగారికిన్
గలుగదె యట్లె మత్కవనకాంతకు నగ్రజకావ్యకాంతకున్
జెలిమియు నైక్యభావమును జెప్పెడిదేమిఁక రత్నమాంబికా! 15

మ॥ కలుగున్ గావుత మెల్లకాలము భవత్కల్యాణదుర్గంబునం
దలఘు శ్రీకలితాచ్ఛకీర్తిరమణీహల్లీసకంబుల్ మహో
జ్జ్వల రాజ్యాయురనామయాభ్యుదయ సంపద్వృద్ధిసంసిద్ధి రా
జిల వర్ధిల్లునుగాత మాకొలము రాజ్ఞీ లోకచూడామణీ॥ 16

---

## ఉత్పలమాలిక.

శ్రీయుత రామసుబ్బకవిశేఖర! పూర్వభవంబునందు నా
రాయణమూర్తిఁ గొల్చితివొ! రాజవిభూమణుఁ గొల్చినాడవో!
తోయజసూతినిన్ గొలిచితో! రమ నద్రిజ వాణిఁ గొల్చి కా
ర్తికేయుఁడవై జనించితివొ! తీయనిమాటలతేటకూర్పు చే
నోయనఘాత్మ! నీకవన మొప్పి గభీరమహాసుధాసము
ద్రాయతవీచికాసముదయం బనఁజాలు సమాసపాళిచే
గేయము ధ్యేయమై విమలకీర్తిదమై యలరారుచుండె; నీ

గాయకవిత్వ మారయ లసత్పదబంధురమాధురీఝరిన్
ప్రాయ మహాత్ములైన కవివర్యులు సైత మయారె మేలు మేల్
మాయురె యంచు మెచ్చికొనుమాడ్కి స్ఫురించుచునుండె; నౌర ని
న్నాయతభక్తిఁ గొల్చినకలార్థులు సత్కవులైర నేకు; ల
య్యా యినుగంటికృష్ణవసుధాధిపుఁ బట్టపుదేవి లక్ష్మిభూ
నాయకుముద్దుబిడ్డను జనస్తవనీయసరస్వతీసతిన్
చేయుదె శ్రీసరస్వతి ఋషిప్రవరాంశజనింపవేని! యో
ధీయుత నీకు మేల్ తెలివిచేటలుగల్గు టఖండగౌతమీ
తోయముఁ ద్రావియుంటనో! బుధుల్ కృప దీవనలిచ్చియుంటనో!
నీయసమానవర్తన మనింద్యము, నీకులమూలపూరుషుం
డేయనఘుండొ యాజియట యీవుదయించినభూమి పద్మజ
న్యాయముచేఁ బ్రశస్తిఁగను నన్నయభట్టు రచించె భారతా
మ్నాయము తన్మహామహిమ మంజుల నవ్య కవిత్వ మబ్బెఁబో
వేయన నేల నీకు సుకవిప్రవరా! వచియింతు సత్యముల్
బాయక నీకు నీయనఁగుభార్యకుఁ బుత్రులకున్ నిరంతర
శ్రేయమగున్ సుఖప్రతతిచేకురు, సంపదలున్ ఘటిల్లు, ధీ
శ్లాయువగున్, మహాసుకవిగణ్యునిఁ బుణ్యుని వేదమూర్తి ని
న్నీయెడఁగూర్చి దీవన నిచ్చి తనర్హుని చిన్నవాఁడనై
నాయవివేక మింతట మనంబున సైపుము నేను దీవనల్
చేయఁగలేదు వాణి ననుఁజేరి, వచించె ననుగ్రహంబునన్

ఉప్పల వేంకటేశ్వరకవిగారు, శతావధాని.

---

గీ॥ కమ్మకమ్మని చవులు నిక్కమ్ము నిమ్మఁ
గ్రమ్మ నీకైత చిమ్మువాక్యమ్ములెల్ల
గోస్తనీద్రాక్షలున్ సుధాఘుటికలగుచు
నతితరాహ్లాద మొదవించెనయ్య నాకు॥

చ॥ సరసకవిత్వముం గుణభృశత్వము సర్వవశిత్వముం మహా
దరమున రాజ్ఞి మీ కిడినదానఁగదా యిటు లింతఁజేసి భా
షరగురుసత్కృతుల్ సలుపుచుం మతికెక్కెద, వింక నీదుపై
ఖరియొ పరార్థమై పరఁగుఁగాన మహాజనకీర్తనీయమా॥

క॥ శ్రీకాంతవు వైకుంఠుం
డై, కల్యాణికిని వాణి కమరజ్యేష్ఠుం
డై, కాళికిఁ బరశివుఁడై
యేకాకృతి వెలుఁగు తత్త్వ మిదు భద్రంబుల్॥

గీ॥ పద్యసరణిని పడలించు గద్యసరణి
గద్యసరణిని వడిపెంచుఁ బద్యసరణి
వరల నీలిఖయించు కావ్యప్రబంధ
లేఖలకుఁ బోల్పఁదగుకృతుల్ లేవు లేవు॥

చ॥ అయినను మిత్రలేఖలు సహస్రశతంబు లహర్నిశంబు దు
ర్వ్యయమనఁబోక బుద్ధికిఁ బయాసమునాక యుపేక్షలేక ని
ర్ణయగతి నేకధాటి నవురా! రుచులూర లిఖంచు నీసువ్యా
ప్రియతకుఁ గేలుమోడ్పఁదగదే? కవిరాజులు రాజరాజులుం

కవిబ్రహ్మ
చతుర్వేదుల-అమరేశ్వర శాస్త్రిగారు.

శా॥ ఆస్థానంబున దేవతానికర మెట్లావాసముం గాంచున
ర్వాస్థానంబనియే సరస్వతి యిటుల్ ప్రత్యక్షమై స్వప్నజ
హ్వాస్థానంబులనిల్చి నైజముగ స్నేహార్ద్రాలవాలంబులో
స్వస్థేయాచ్ఛకవిత్వచారులతికాసూనాకృతుల్ చూపెడుం॥ 1

మ॥ అలఘుస్వప్న విచిత్రదోహద నవోద్యద్రూపమై దోఁచె స్నే
హలతాసూనము నూఱు రేకుల ననన్యచ్ఛాయలం భారతీ

తలుసీవ క్త్రికు కేశయుంబనఁగ రత్నప్రాజ్యరత్నాచ్ఛిదో
జ్జ్వలమాచుండ సురభీకృతాంచిత మరుదాస్యైకృష్టషట్పదభ్రింగమై॥ 2

చ॥ ఒకనికిఁ బల్కఁదోడగుచు నొక్కనిగంటమునందునిల్చి వే
ఱొకనికి దాసియై మఱియొక్కని మేలుగనేలురాణియై
సుకృతులఁగూర్చు భారతి విశుద్ధచరిత్రుని రామసుబ్బరా
ట్సుకవిని నేలు.నన్నఁటను జోద్యము తత్పుకృతం బదెట్టిదో॥ 3

సీ॥ కొల్లాపురంబులో గొంతెత్తిచీరిన
పలుకు "నో" యనుచు నబ్జజునిరాణి
సురభివంశస్తోత్రిసూక్తికి మున్నాడి
మంజీరరవముతో మలయు వాణి
ప్రాయంగఁ గలమెత్త రామసుబ్బారాయ
కవికి శారద తోడుగావసించు
తనుఁగొల్చు స్నేహలతాకవితాసంఘ
మాశ్రమంబుగ నిల్చు నజునిదేవి

గీ॥ యనుచు శతధా సమావిష్క్రియా సమర్థ
మైన యీకావ్యదివ్యలతాంతరాజ
మలరుఁగాత నిజామోద హారియగుచు
రత్నమాంబా యశస్సౌధ రత్నమగుచు

కవితావిశారద,
పండితారాధ్యుల సూర్యనారాయణమూర్తిగారు.

ఉ॥ వేయిభవంబులందొ పదివేలభవంబులనో గడించు న
త్యాయతపుణ్యసంగతిని నబ్జెదు నబ్జజురాణి వాణి సు
శ్రీయుతమైన దర్శనము చేకురఁగల్గెను నీమహాకవీ
మాయురె! నీయదృష్ట మసమాన మహానము సుబ్బరాట్కవీ! 1

ఉ॥ నీవును నీకుటుంబమును నిత్య మనీదృశమైనభక్తి వా
గ్దేవినిఁ గొల్చుచుందురు త్వదీయ సుహృత్తతియున్ భజింప స
ద్భావముతోడ నొక్కకవితాసమితి న్నెలకొల్పినావు; భా
షా వనజాస్య నీయెడఁ బ్రసన్నతఁజెందుట యబ్బురంబొకో! 2

చ॥ తడవులనుండి నీవు కవితావ్యవసాయమునన్ మెలంగుచున్
పడలనిదీక్షతోఁ జలిపినావు సరస్వతికిన్ సపర్యలన్
బడసితి వాపెదర్శనపుభాగ్యము నన్యదురాపదంబు ధ
న్యుఁడ వభివర్ణనీయుఁడవునన్ సుగుణాలయ! రామసుబ్బయా!! 3

మ॥ కవిసంఘంబున నీవు ధన్యుఁడవు వాక్కాంతామణీదర్శనం
బవుట న్నీ కవలంబనంబొసఁగి యత్యంతంబు మన్నించుటన్
భువనఖ్యాతి వహింపఁగల్గెను జటప్రోల్భూధవాస్థానమున్
స్తవనీయంబులు మీ కవిప్రభుమిథస్సౌభాగ్య సందర్భముల్॥ 4

శా॥ అమలాంధ్రాంగల వాఙ్మయాబ్ధి మథనోద్యద్ జ్ఞానపీయూష సా
రము నాకంఠముఁగ్రోలి త్రేన్చిన మహాప్రజ్ఞాధురీణుండవున్
సముదంచత్కవితావిశేషకలనా సంతృప్త వాణీప్రసా
ద మహాశ్రీవి రామసుబ్బయకవీ! ధన్యుండ వీవెంతయున్॥ 5

ఉ॥ ఇరువురొ మువ్వురో వడసిరేమొ సరస్వతిదర్శనంబు ము
న్నరుదుగఁ బోతనాదులు మహాత్ములు నాఁటికి, నేఁడు నీకుఁ జే
కురెను దదీయదర్శనము కోవిదమాన్యముఁ గీర్తనీయమున్
బరమపవిత్రముంగద భవత్సుచరిత్రము సుబ్బరాట్కవీ॥ 6

ఉ॥ చారుపదప్రబంధమును జక్కనిశయ్య యలంక్రియా చమ
త్కారము భావసౌష్ఠవ ముదారసమాస విశేషకల్పనా
చారిమ మర్థపుష్టి సరసంబులు సాజములై సుధీమనో
హారిత నీకవిత్వ మలరారు సుహృన్మణి! ధీమదగ్రణీ॥ 7

ఉ॥ దంపతులిద్దఱుం సుకవితారచనా వ్యవసాయ మూని ని
ష్కంపితవృత్తి దోహదముసల్పఁగ శ్రీజటప్రోల్విభుండు పో
షింపఁగ లోపమేమి? విలసిల్లు మిఁకం గవిలోకమెల్ల హ
ర్షింప నిత్యోధితోన్నతిని స్నేహలతాకవితాసమాజమా!

సీ॥ సురభివంశాబ్ధిచందిరుఁడు లక్ష్మారాయ
పార్థివుం డంకురార్పణము సేయ
ధర్మకల్పకవల్లి తత్సాధ్వి వేంకట
రత్నాంబ పోషణారంభమూన
నన్వర్థనామయై యలరు సరస్వతీ
దేవి మారాకు హత్తించుచుండ
మాధవోపమ జగన్నాథరాణ్మౌళి శ
శ్వద్వికాసంబును సంతరింప
గీ॥ సారిది లక్ష్మీసతీ రామసుబ్బరాయ
దంపతులు పూనికమై దోహదంబొనర్ప
సురభిళంబయి సుకవిసంస్తుత్యమగుచు
స్నేహలత వర్ధిలుంగాత చిరతరంబు॥

పండితారాధ్యుల,
నాగభూషణముగారు.

---

సీ॥ భాషా విభూషా విశేషార్యవేషాంధ
పోషాభిలాష సంతోషమేమొ
తెలుఁగులఁ గలుగు లేజిలుఁగులఁ వెలుఁగులం
దలుగులఁ దొలఁగింప మొలఁగుటేమొ
సారాంధ్రసారస్వతారామ కీరావ
ళీరావ సంజీవలీల లేమొ
మదిలోన గుదిగొన్న తుదిలేని చెదరులఁ
మొదలంట నదలింపఁ గదలుటేమొ

గీ॥ హేతువాదవివాద సంఘాత రహిత
సరళి మాతృసాక్షాత్కృతి సంస్తుతింప
బెమ్మకును దలలోనిశేజెమ్మ కెన్ని
తరతరాలు వర్ణించినఁ దరముగాదు॥ 1

శా॥ వ్యాప్తింగోరక భారసాచల మహాహంకారపంకంబుతో
నాప్తశ్రేణులఁ ద్రోయకే కొలుచుటన్ సాక్షాత్కృతుల్ దక్కఁగా
ర్వ్యాప్తస్వాంత కళాకలాప బలధైర్యస్థైర్య గాంభీర్య సం
ప్రాప్తానందనిధాన పూర్వసుకృత ప్రాబల్య సాఫల్యమై॥

ఉ॥ న్యాయపథంబుఁదప్పక నిరంతరముం గవితాప్రచారముం
జేయుచు బాసకొల్వు నిజజీవితదీక్షగ సంగ్రహింతురిక్కా
రే యిటువంటిమిమ్ముల వరించెను శ్రీజననీపదాంబుజా
వ్యాయత దర్శన ప్రకృతభాగ్యము భక్తజనైకభోగ్యమై॥

శా॥ తండ్రీ! నీమొదలోనిబత్తిఁ గనినంతన్ బ్రాంగి కోర్కుల్ మదిన్
దీండ్రింపన్ దనబిడ్డనిన్ గనెదు లోఁదీపుల్ గుబాళింపఁగా
గండ్రల్ దీరిచి నిన్నుఁ బ్రోచుకొఱకై కన్పట్టెనో వేల్పుప్రో
యాండ్రిందున్ దెలుగింటియాడుపడుచౌరా! వచ్చి దీవించెనో॥

ఉ॥ అమ్మలఁగన్నయమ్మ మమునందఱఁ గన్నులఁగొన్నయమ్మ దో
సమ్ములఁ జిమ్మికొమ్మ సరసన్ దనబాసకు నూడిగమ్ము నా
కుఱ్ఱమ్మడి కమ్మలందు సమకూరిచి తీరిచిదిద్దినట్టి మా
కమ్మనియుప్పనమ్ముఁ గొనఁగన్ దమముందట గట్టి నిల్పెనో?॥ 5

కవిరస్వాజ్ఞాను,
అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు.

ఉ॥ ఒక్కొకగ్రంథ మారయ మహోన్నతభావ సమన్వితంబమై
చక్కని శైలి నొప్పుచుఁ బ్రశస్తమణీమయ భూషణంబగున్
నిక్కముగా స్వదేశజననీ పరమాంచిత కంఠసీమకున్
జెక్కలు వాక్కులేమిటికి? విశ్రుత కీర్తిరమా దురంధరా!॥

క॥ ప్రకటిత మొనరించితిఁ దా
వకగుణసంపత్తి నాదు భాగ్యముకతనన్
అకలుష మహనీయ హృదయ!
సుకవినికర గేయ! రామసుబ్బారాయా!

క॥ హృద్యంబులైన యుష్మ
త్పద్యంబులు చదివి నేను ధన్యుఁడనైతిన్
విద్యాధీశ్వరికృప నన
వద్య యశోధనుఁడవగుచు వర్ధిలు మెప్డున్!

జనమంచి సీతారామస్వామిగారు,
తెలుఁగు పండితులు, అనకాపల్లి.

శా॥ శ్రీసౌజన్యము దేశమెల్లనెఱుఁగున్ నీ వెప్డుఁడున్ సల్పు భా
షాసేవారతి నాంధ్రదేశము కృతజ్ఞత్వంబునన్ దాల్చు వా
ణీసాక్షాత్కృతిఁ గన్నధన్యుఁడవు నిన్ నిత్యంబు శోభించుటన్
వాసింగాంచుత రత్నమాంబ యసమప్రఖ్యాతిఁ బ్రాపించుతన్!

గీ॥ అల జగన్నాథునవతార మనఁగఁదగిన
శ్రీ జటప్రోలునగర పార్థివవతంస
రాజగన్నాథనృపు నాదరాతిశయము
నీకు శ్రీరామరక్షయై నిగ్గుఁగూర్చు!

క॥ కవులును బుధులును భక్తిని
నివాళియొసఁగఁ దగినట్టి నీ స్నేహలతా
కవితామండలి కబ్బపుఁ
బువుగుత్తులుపూచి కీర్తిఁ బొదలెడుఁగాతన్!

కవిసింహ, కళానిధి, కవిసార్వభౌమ
డి. రాజశేఖరశతావధానిగారు.

సీ॥ స్థానమా సురభిమాధవరాయ వాచావి
లాసభాసురము కొల్లాపురంబు
పలికయా దావలీలా ధురంధరుం
డౌ జగన్నాథరాయప్రభుండు
వృత్తియా సకలసంవిద్బోధక ప్రభా
వాయత్తమా నుపాధ్యాయపదవి
పూనికయా కావ్యముక్తాఫలంబుల
భారతీదేవి సంప్రార్థనంబు
గీ॥ ఇన్ని సుగుణంబు లొకచోట నెసకమెసఁగ
నేమిచిత్రంబు వాక్సతీ హృదయపీఠి
స్నేహలతికాసుమార్చనఁ జేసెదనిన
సుగుణగణగేయ! శ్రీరామసుబ్బరాయ!

విద్వాన్, కేశవపంతుల నరసింహశాస్త్రిగారు.



ఉ॥ భీమనకన్న నీవు కడుఁబెద్దవు భీమన తామసుండు నీ
వో మహనీయ! శాంతి దమ మొందిన సత్త్వగుణుండ వార్య! యా
భీమన సత్కవీంద్రుఁడయి పెక్కులు శాపము లిచ్చెఁగాని యో
రామన! తారకుండవు వరంబులనే దయసేయు దెప్పుడున్॥

ఉ॥ భారతి నీకుఁ దల్లియయి భవ్యసుఖంబు లనుగ్రహించి నీ
కోరికలెల్లఁ దీర్చుఁ గవికోకిలమన్న యశంబుఁ గూర్చి నా
వీరనకంటె నీవు కడుఁబెద్దవు మాకనుబోలె సేవలన్
గూర్చి కొల్చుచుంటి విది కూడెనె? వీరన కెన్నఁ డేనియున్॥

భారతి భక్తితోఁ గొలిచి వ్రాసితి కావ్యమొకండు నీవు శ్రీ
భారతి మీర దేవతయు భాసిల స్వప్నమునందు సత్కవీ!
భారతి ధాత్రిఁ బర్వఁ గవిభారతి యారవితారకంబు స
ద్భారతివృత్తి నివ్వటిల భారతధారుణిఁ దేజరిల్లుతన్ ॥

[illegible]

కవి సోదరులు { కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, శ్రీవనపర్తి సంస్థానపండితులు. మాదిరాజు విశ్వనాథరావుగారు.

స్నేహలతా కవితాసంఘసభ్యులు.

———::o::———

కలలోనేయగుఁగాక నీ కటుల సాక్షాత్కారమై మంజుశా
మల లాలించెనవాణి యన్నఁ బరమాశ్చర్యంబుగాదోకో? యీ
కలికాలంబునఁగాని పూర్వకవివాక్ప్రాశస్త్యముల్ నమ్మ వి
జ్ఞుల కీఘట్టము విభ్రమం బెటులఁగూర్చున్ సత్కవీంద్రాగ్రణీ॥
ఇతరుల్ నమ్మిననమ్మకున్న నొకటే? నీకు సుబ్రాయ! భా
రతిసాన్నిధ్యమునన్ గవిత్వసుమహారంబుల్ వెసన్ గూర్చ సం
తతమున్ సంతసమందుచుంట దినకృత్యంబౌట విద్యుల్లతా
ద్యుతి భాసిల్లు సరస్వతిన్ గనుట ధన్యుండీవెకా సత్కవీ॥
శ్రవణీయాద్భుత సత్కవిత్వరచనా చాతుర్యపారీణులౌ
కవులే ధన్యులు భారతిన్ గనెడు భాగ్యప్రాభవుల్ సత్కవి
ప్రవరుల్ ధన్యతముల్ త్వదీయ కవితాప్రాగల్భ్య మొప్పన్ స్వయం
భవుదేవేరియె దర్శనంబిడియె స్వప్నంబందు సామాన్యమే?॥

చిత్రవిశారద యం. రామకృష్ణారావుగారు.
పెర్సనల్ సెక్రిటరి, శ్రీజటప్రోలు సంస్థానము.

చ॥ నిరతము దైవభక్తి నవనీతసమానమనంబు పాండితీ
గరిమయు బంధుప్రీతియు నిగర్వము శాంతము నిస్తులంబు వా
గ్ఝరియును గార్యనిర్వహణశక్తియుఁ గల్గినవాఁడవౌట నీ
కౌరులు సమానులెట్లు? మది యోజనసేయవె? సుబ్బరాణ్మణీ॥

చ॥ వినయవిభూషణుండవు వివేకధనుండవు నిష్కళంకవ
ర్తనుఁడవు పట్టభద్రుఁడవు ధర్మవిదుండవమాయికుండ వా
ప్తనికరబాంధవుండవు సుభాషివి జాతవిరోధి వీవు కా
వ? నిను ముఖస్తుతింజలుపునట్టి హితుండనె? సుబ్బరాణ్మణీ॥

చ॥ తరుణవయోవిలాసుఁడవు తప్పవునీతిపథంబుఁ జేన్నెను
నరయుదు వెప్పు మిత్రులసుఖాతిశయుంబె వృథాప్రసంగముల్
జరుపవ యార్తకోటినిఁ బ్రసన్నదయామతిఁ గావఁజూతు వె
వ్వరికిలభించు నీహితము వారిదె భాగ్య మనంగఁజెల్లదే?॥

చ॥ దురితహరుండు భక్తపరితోషితచిత్తుఁ డజాండభాండ సం
భరితుఁడు సర్వసద్గుణసమన్వితుఁ డాద్యుఁ డనంతకోటి భా
స్కరరుచిరుండు నగ్జనకల్పుఁడు సప్తగిరీంద్రవాసుఁ డా
తిరుపతి వేంకటేశ్వరుఁడె దిక్కగు సాకుత నిన్ను మిత్రమా॥

మద్దాలి ఉమామహేశ్వరరావుగారు.

ఉ॥ హాటకగర్భరాణి రతసాంబిక గోషకురాలు నీకు నిం
కేటికి లోపముండును? మహీసురసత్తమ! మిత్రశేఖరా
ధాటిగ వ్రాయునేర్పు; కవనంబు కరంబు రసంబుఁజిల్కు నీ
పాటవ మెన్నఁగాఁదరమె? పండితకోటికినైన [illegible]॥

శ్రీ॥ సౌ॥ చేబ్రోలు సరస్వతీదేవిగారు,
సరస్వతీరామాయణ గ్రంథకర్త్రి.

మ॥ పలుకుందోడయి తాంధ్ర నైషధపుఁ గావ్యశ్రీని నిర్మించునాఁ
డల శ్రీనాథకవీంద్రచంద్రునకు మాతా! నేఁడు సాక్షాత్కృతిన్
గలలో దివ్యసుధార్ద్రవీక్షణరుచుల్ గ్రాలం గటాక్షించినా
విల నీభక్తుని సుబ్బరాయకవి నెంతేనిన్ గృపన్ భారతీ॥

ఉ॥ ధన్యుఁడు సుబ్బరాయకవితల్లజుఁ డేటికిఁ బెక్కుమాట లే
యన్యుల కిట్టిదర్శనమహత్తరభాగ్యము లభ్యమౌను మూ
ర్ధన్యులటంచు నెంచు కవితానిధు లెందరు లేరు నేఁ డసా
మాన్య ప్రబుద్ధశారద సుమంగళరూపముఁ గాంచఁగల్గిరే?॥

మ॥ కులదైవంబని యిష్టదైవమనుచున్ గొండాడి పూజించి స్నే
హలతాసత్కవితాఖ్యసంఘ రచితాహ్లాదామృతాస్వాద్య కా
వ్యలతాంతంబుల సెజ్జఁగూర్చి పవళింపం జేసి లాలించు భ
క్తుల కాచార్యుఁడు పండితుండు కవితాధుర్యుఁడు సుబ్రాయఁడే॥

ఉ॥ ఆతఁ దలంతియంచుఁ గలనైనఁ దలంచుట పాపమౌను, వి
ఖ్యాతకవిత్వభాగ్యరమఁ గైవసముల్ బొనరించి వాణినిన్
రాత్రి నిశీథ నిద్రఁ గని రమ్యశుభాకృతిఁ జూడఁగల్గుటల్
భూతలమందు వింటిమి ప్రబుద్ధుని నొక్కని వీరభద్రునిన్॥

ఉ॥ కూరిమితోడ వాణికి నకుంఠితకావ్యవిభూష లిచ్చి దే
వేరిగ గారవించిన కవిత్వసుధాబ్ధి యాంధ్రజైమిని నీ
భారతకర్త సుజనవంద్యుఁడు శ్రీపిసవీరభద్రు నా
కారముఁ జూసి పుట్టెనఁ గావలె మన్గురు సుబ్బరాయనిన్॥

కవిచంద్ర కె. సంపత్కుమారాచార్యులుగారు.

గీ॥ భారతీదేవి నీ కనుపండువుగను
దర్శనం బిచ్చెనన్న విధానమెల్ల
మాకుఁ బ్రియంబు నయ్యెఁ బ్రమాణమయ్యెఁ
గాని కాదనువారల కథనమేల!?

గీ॥ వంశగౌరవ మొక్కండు వరలు మొదట
దానికినిఁదోడు నెయ్యంపుఁదనము మిగులు
వానికన్నను మించనౌ భావమందుఁ
దానకంబౌదు సుబ్రాయ మాననీయ!॥

గీ॥ నిజము నీయిల్లు పాండిత్యనిలయమగుట
గ్రంథరూపసరస్వతి కరుణఁజూపి
కలను దోఁచుచు నీకొక సాక్షాత్కరించె
నింతభాగ్యంబు కల్గునే? యెవరికైన॥

విద్వాన్ గొట్టుముక్కల నీలకంఠశాస్త్రిగారు.



ఉ॥ ఆతఁడు వాజపేయకులమంతయు వన్నెగడింపఁజాలి యా
భారతకావ్యకర్తయగు వ్యాసమునీంద్రునితండ్రిగోత్ర మే
పారఁగఁజేసి సర్వజనవంద్యుఁడవై విలసిల్లునీకు నా
భారతి దర్శనంబిడి కృపామతిఁ బ్రోచుట వింతయేటికిన్॥

ఉ॥ శూరుఁడవీవు రమ్యగుణశోభితమూర్తివి దేవిపాదపం
కేరుహముల్ భజించు బుధగేయుఁడ వాంధ్రకవిత్వరేఖ కా
ధారుఁడవై జనించినకతమ్మునఁ బూజ్యుఁడ విట్టినీకు నా
భారతి దర్శనంబిడి కృపామతిఁ బ్రోచుట వింతయేటికిన్॥

ఉ॥ వ్రాసిరి నన్నయాదికవివర్యులు మున్ను సమస్తనీతు లీ
భూసురఁ డింక నన్యహితముల్ మఱి వ్రాసెడిదేమటందు రే
మో? సరియౌనె? సత్కవుల యూహలు కాలముఁబట్టి క్రొత్తవై
భాసిలుఁగాన నీకవిప్రబంధము శ్లాఘ్యము వేయునేటికిన్॥

కందకవి:
గంధం నరసింహాచార్యులుగారు.

సీ॥ పలికెనే? పలుకువెన్నెలలొలుక దంతకాం
తికరుచి యెల్లెల్లఁ గ్రిక్కిరియఁగఁ
బలికించెనే? తన పసిడి కిన్నరవీణఁ
తనువెల్లఁ దన్మయత్వము వహింప
నిచ్చెనే? యాతిస్సు లిభరాజగమన సిం
హేంద్రమధ్యమ కృపాదృష్టు లొలయ
వ్రాసెనే? మీపేరు భక్తాగ్రగణ్యుఁగాఁ
దనచేతి చిన్నిపొత్తమ్మునందు
గీ॥ నీదు భాషాక్రమంబు మన్నించెనో కొ?
మంచిచెడ్డలగతు లేర్పరించి చెప్పి
మనుజులకు మాటలిచ్చిన మంచియమ్మ
బ్రహ్మదేవునికొమ్మ సరస్వతమ్మ॥

కందకవిసార్వభౌమ
వీరుభొట్ల సూర్యనారాయణగారు.

---

I am ineffably happy to know that you are blessed with the divine presence of Bharati. The deity swims in to the heart of a devotee through the channel of inspiration. Poetry has its birth in the fountain of feeling and your heart is a spring of this type. May your earnest endeavours in the field of Parnassus be crowned with success.

Jonnalagadda
Satyanarayanamurthi Garu. M. A, B. L.

శ్రీమత్పరదేవతాయైనమః

# భారతీసాక్షాత్కారము.

---

ఉ॥ శ్రీకర రామనాథగుణశేఖరుఁడా జనకుండు,సుబ్బమాం
బా కనినట్టితల్లి కులమా సవనంబులకాస్పదంబు, సు
శ్లోకుఁడు వేంకటేశుఁ డిలలో నిలువేల్పు, తెలుంగుకైతయే
నాకిలజీవనంబు నిను నమ్మినభక్తుఁడ నోసరస్వతీ! 1

సీ॥ వాజపేయాది సవనరాజములచేత
మిగుల దేవేంద్రునిమించినట్టి
నాల్గువేదములందు నలుమొగంబులవేల్పు
మించి యశంబును గాంచినట్టి
షట్ఛాస్త్రముల రాజసభలందు బ్రతివాది
పండితేంద్రుల భంగపఱచినట్టి
కశ్యపాత్రివశిష్ఠ గాధిపుత్రాదుల
మించి తపంబుఁ గావించినట్టి
గీ॥ వాజపేయయాజులవర వంశమందు
సుబ్బమారామనాథ విశుద్ధగర్భ
మందుఁ బుట్టు భాగ్యంబిచ్చు నజునిరాణి!
స్వేచ్ఛ నటియింపు మమ్మ నాహృదయసీమ.॥ 2

శా॥ వేదంబుల్ విభజించి సూత్రములలో వేదాంతముల్ దెల్పి యా
మోదావాల పురాణజాల మఖిలంబుల్ వ్రాసియున్నట్టి యా
వేదవ్యాసునితండ్రిగోత్రమున నావిర్భూతి నేఁ గాంచితిన్
వేదార్థంబు గ్రహించినాఁడను బునర్విప్రత్వ సంసిద్ధికిన్.॥ 3

ఉ॥ వైదికమార్గవృత్తి యనఁ బ్రాణమునాకుఁ, బఠింపలే దొగిన్
వేద మొకింత; తెల్గునఁ గవిత్వ మెటోలభియించెఁ, బొట్టకై
మేదిని నాంగ్లవిద్యయును మేలగు 'పాళియు' సంస్కృతంబునం
దాదృతిఁ జేసి కొంతయును నభ్యసనం బొనరించి పెంచితిన్॥ 4

ఉ॥ ఇంతకు నాంగ్లభాషకయి యెక్కుడుకాలము పుచ్చినాఁడ నే
నంతట పట్టభద్రపతినైతిఁ, గవిత్వము నీడవోలె న
న్నెంతయు వీడకుండె, నటు లేనును దానినిఁ బెంచినాఁడ; జ
న్మాంతరదోషముల్ తొలఁగునంచు భజింతు నిటుల్ సరస్వతిన్॥ 5

మ॥ కలకాలమ్ము వ్యయప్రయాసములకుం గాసంత గాసిల్లకే
కలలందైనఁ గవిత్వతత్త్వవిలసద్గ్రంథంబు లేపారఁగా
లలిఁ జేయన్ దలపెట్టినాఁడఁ బుడమిన్ లక్ష్యంబు సూత్రించి శ్రీ
లలనారత్నము ప్రోత్సహింప సఖు లాహ్లాదంబునన్ జూడఁగన్॥ 6

శా॥ ఈరీతిన్ బెనుపొందు నాంధ్రకవితా హేలావిశేషమ్ముచే
ధారాళంబుగ వ్రాయుచుంటిఁ గృతులన్ దజ్ఞుల్ ప్రశంసింపఁగాఁ
జేరన్ దీసితి మిత్రబృందముల వాక్ఛ్రీవైభవం బొప్పఁగా
వారిన్ వీడక వ్రాయుచుందు నెపుడున్ వర్ధిల్లఁగా లేఖలన్॥ 7

సీ॥ కవిరాజ బుధగురు స్తవనీయకీర్తివై
భవశాలి కవిసార్వభౌముకరుణ
శతలేఖినీపద్యసంధానకర్తలౌ
తిరుపతివేంకటేశ్వరులకరుణ
సంస్కృతాంధ్రకవిత్వ సామ్రాజ్యకలితుఁడౌ
శ్రీ చిలకమర్తి నృసింహుకరుణ
సంగీతసాహిత్య సరససత్కవితాభి
నందితుండగు రామనాథుకరుణ

గీ॥ కారణమ్ముగఁ గల్గినచారుమతినిఁ
బెద్దలౌ కవిచంద్రులయొద్ద నిలువఁ
గలుగుభాగ్యంబుచేకూఱెఁ గఱవుదీఱ
నభినుతించెద వారల ననుపదంబు॥ 8

ఉ॥ సారములేని సంసరణసంగతి రోసి వనాంతరస్థలిన్
జేరి తదేకనిష్ఠఁగొని చిత్తము నిల్కడఁజేసి మోక్షపుం
ద్వారముఁ జేరఁగాఁదలఁచి ధ్యానసమాధిని యోగమార్గమున్
ధారణసేయు శంకరపదంబుల కేను నమస్కరించెదన్॥ 9

చ॥ కానలఁజేరి యందుఁగల కర్కశదర్భలపాన్పుమీఁద నా
సీనతనొంది దేవిపయిఁ జిత్తమునిల్పుచు నక్షమాల లెం
తేనియుఁద్రిప్పుచున్ గనుల నించుకవిప్పుచు సత్కథాసుధా
పానముఁ జేయుమౌనులకు వారనిభక్తి నమస్కరించెదన్॥ 10

సీ॥ భజియింతు నొకసారి వాల్మీకిమునినాథు
భక్తిభావంబులు పరిఢవిల్లఁ
బ్రార్థింతు నొకమాఱు వ్యాసమహర్షిని
వాంఛితార్థంబులు వడయుకొఱకు
నుతియింతునొకవేళ నోరూరఁగాఁ గాళి
దాసు మహాకవితారసజ్ఞు
భావింతు నొకసారి భవభూతికవివర్యు
సకలార్థ సంగహాసరణికొఱకు
గీ॥ వీరువారననేల? యెవ్వారలైన
సత్కవులజాడ లెఱిఁగినఁజాలు నాకు
మమత దీఱఁ జేసాచి నమస్కరింతుఁ
గలలయందైనఁ జూచువేడ్కలు సెలంగ॥ 11

క॥ నెట్టనఁ గొల్చెద నన్నయ
భట్టోపాధ్యాయు నాంధ్రభాషాసృష్టిన్
బట్టంబుఁగొనిన సత్కవి
రాట్టుని నేఁజేయునట్టి గ్రంథముకొఱకై॥ 12

ఉ॥ మూఁగురు సాటివత్తురు త్రిమూర్తుల కన్నిఁటఁ గావ్యసృష్టిలో
మూఁగురకున్ సమానమగుమూర్తి కనంబడ, దావిరాట ము
ద్యోగములందుఁ దిక్కన మహోన్నతభావవిశేష శేముషీ
శ్రీగరిమం బనన్యకవిశేఖరలభ్య మనంగనొప్పదే॥ 13

క॥ ఆపాండితి యావాచా
నైపుణ్యం బామనోజ్ఞ నయమార్గవిధం
బాపాత్రౌచిత్యగుణ
శ్రీపాటవ మెంచ సుకృతసిద్ధము సుమ్మా!॥ 14

శా॥ శ్రీనాథున్ గవిసార్వభౌము నెదఁ బ్రార్థింతున్ సదాభక్తిమై
యేనాఁడైనను దర్శనంబిడుచు నన్ వీక్షించి లాలించి వి
ద్యానైపుణ్యమునందు లోప మొకయింతన్ గూడ రాకుండఁగా
నానందంబును గూర్చి ధన్యునిఁగఁజేయన్ సత్కవిశ్రేణిలోన్॥ 15

మ॥ కలమున్ బూని బుధుల్ నుతింపఁ గవితాకౌశల్యమున్ జూపి నే
నిల సంఘంబని పేరుపెట్టి కవులన్ హేలావిశేషమ్మునన్
బలుచందంబుల భవ్యనవ్యకృతులన్ వ్యాపింపఁగాఁ జేసి రా
జిలుచుంటిన్ జటప్రోలురాజ్ఞికరుణన్ శ్రీభాగ్యసంపత్తిచేన్॥ 16

ఉ॥ చిక్కనిప్రేమ మెంతయును జిల్కఁగఁజేసి గురుండనంచునా
యక్కఱగల్గువేళ సమయంబదియంచు సహాయమిచ్చి న
న్నెక్కుడుభక్తి పెంపున ననేకవిధంబులఁ గంటిరెప్పమై
చక్కఁగఁ జూచునట్టి గుణసాధ్వినిఁ గొల్చెద రత్నమాంబికన్॥ 17

ఉ॥ ఏజననీకటాక్షమున నెంతయు వన్నెకువచ్చుచుంటినో
యేజననీకృపాకలన నేఁ దగుభాగ్యముఁ గాంచుచుంటినో
యాజననిన్ భజింతు రతనాంబను మిక్కిలిభక్తిఁ బెంపునన్
భ్రాజిత వైభవోన్నతి నిరంతరమున్ దనరారునట్టుగన్॥ 18

ఉ॥ పావనమైన యీసురభివంశముఁ జొచ్చితి నందు రాజ్ఞియున్
భూవరుఁడున్ సరస్వతియుఁ బొల్పెసలారఁగ గౌరవించి స
ద్భావముచొప్పునన్ గురుపదమ్మున నిల్పిరి కానఁ గీర్తితే
జోవిభవంబు లీయఁగలసూక్తులఁ జెప్పి తరింపనెంచితిన్॥ 19

చ॥ పలికినపల్కులెల్ల భగవత్కృపచే విలసిల్లఁగావలెన్
దలఁచినభావమెల్లఁ బరదైవ కృపాకలనన్ ఫలింపఁగా
వలెఁ గలమూని వ్రాసినది భాసిలఁగావలె నట్లు కానిచోఁ
బలికినలాభమేమి? తలఁపన్ బనియేమి? రచింపనేటికిన్?॥ 20

శా॥ ఆదిన్ శ్రీయుత లక్ష్మరాయమణి యాప్యాయమ్మునన్ జేర్చె నా
మీఁదన్ వేంకటరత్నమాంబిక కృపామేయప్రభన్ నింపె నా
పైఁ దాత్పర్యము శ్రీసరస్వతియుఁ జూపన్ సాగె నానాఁటికిన్
నాదౌపుణ్యము వృద్ధిఁజేసెఁ జగన్నాథక్షమాజానియున్॥ 21

క॥ నైషధకావ్యము కవులకు
నౌషధమని చెప్పుచుందు రార్యజనంబుల్
దోషం బేమిటఁ గల్గెనో
రోషంబున సంగ్రహింప రోయుచునుంటిన్॥ 22

శా॥ ఆదిన్ లక్ష్మణరాజమౌళి యెద నత్యంతానురాగంబు నా
పై దైవారఁగఁ జూపి కాన్కయనుచున్ వ్రాసిచ్చి నాకిచ్చె, నా
పైఁ దానే నిజహస్తపద్మమెసఁగన్ భావించి నూరార్లన
మ్మోదంబొప్పఁగ నిచ్చె నట్టికృతినిన్ బోఁగొట్టుకొంటిన్ గదా॥ 23

ఉ॥ అట్టిపవిత్రమైనకృతి నట్టిమహాకవిసార్వభౌముచేఁ
గట్టిగ వ్రాయఁబడ్డ ఘనకావ్యము శ్రీజటప్రోలునేలుస
ప్రమాట్టు బహూకరించి కవిరాజున కిచ్చినగ్రంథ మద్దిరా
యెట్టుల సంగ్రహింపఁబడె నేరికిగోచర మానొసెప్పుమా॥ 24

ఉ॥ ఇచ్చినవాఁడఁగాను బరులెవ్వరిచేతికి నెట్లుచిక్కెనో
హెచ్చెము లేనిమైత్రిఁ గొని ముందుగఁజూపి వచించువారలన్
మెచ్చి నమస్కరించి మితిమీరినకానుకల నెన్నియేనియున్
జెచ్చెరఁ బెట్టు వాఁడఁ గృతిచేరునుపాయ మెఱుంగఁజెప్పరే॥ 25

ఉ॥ ఎవ్వరుసంగ్రహించిరొ మఱెవ్వరి కేవిడినానొ జ్ఞాపకం
బెవ్వరికుండు? మిత్రులన నెప్పుడు దైవముగాఁగఁజూచుటల్
నివ్వటిలంగ సత్యమని లెక్కకువచ్చెడు భాగ్యమున్నచోఁ
జివ్వన నైషధంబు కడుఁజిత్రగతిన్ ననుఁజేరుఁగావుతన్॥ 26

ఉ॥ ఆవలఁ గొన్నినాళ్లకు దయామతి శ్రీమతి శ్రీసరస్వతీ
దేవియనుగ్రహంబున మదిన్ గలచింత యణంగునట్లుగాఁ
బావనమైన స్వప్నమున భాసిలి నైషధకావ్య మింటిలో
శ్రీవిభవాఢ్యతన్ వెలుఁగుఁ, జేకొనుమంచువచించినంతటన్॥ 27

ఉ॥ లేచి నమస్కరించుచు బలే కడుధన్యుఁడనైతినంచు నేఁ
జూచితి నైషధంబుఁ గడుఁజోద్యముగాఁ గననాట దేవికిన్
నా చతురత్వ మేర్పడ ఘనంబుగ సేవలుసేయనెంచితిన్
నోచిననోముసత్ఫల మనూనముగాఁ గొనితెచ్చెనంచొగిన్॥ 28

ఉ॥ చేసినసేవ నేఁటి కొకసిద్ధినిఁ గాంచెనటంచు నాత్మ సం
తోసము గల్గె నాకు విబుధుల్ గొనియాడెడురీతి సర్వదా
వీసమునైన లోటు కనుపింపనిరీతిగ శ్రీసరస్వతీ
భాసురరూపిణిన్ గొలుచువాఁడను జీవితశేషమంతయున్॥ 29

చ॥ నైషధకావ్య మెప్పుడు ఘనంబుగ భక్తిఁబఠించుచుందు నా
కౌషధమద్ది జీవికకు నాత్మసుఖం బొనఁగూర్చు నద్దియే
యోషధి జ్ఞానికోటికని యుత్తములెల్ల వచించుచుంద్రు నా
దోషము వాయునట్లు పరితుష్టిగఁ దద్రసమెల్లఁ గ్రోలెదన్॥ 30

చ॥ కలలను గాంచుసంగతు లఖండశుభంబులు గూర్చవంచు నా
కలలనిఁకన్ యథార్థములుగావని లోకము సెప్పఁగాని నా
కల యిట సార్థకంబగుటఁ గల్లయటం చెటుచెప్ప నేర్తు? ధీ
బల మతిపూతమై తనరువారికి నన్నియు మంచివౌఁగదా॥ 31

చ॥ నలుబదియారువర్షములనాఁటికి. నేఁటికి శ్రీసరస్వతీ
లలనయె మత్పురాకృతఫలంబుగఁ గన్పడె నాకుఁ గాన నా
కలముకొలంది బద్ధక మొకప్పు డొకింతయునైన లేక నే
సలుపుచునున్న సేవ కిది సత్యనిదర్శనమంచు నెంచితిన్॥ 32

ఉ॥ భారతి స్వప్నమందుఁ గవివర్యులపిల్చినఁ బల్కుచుంట స
త్కారముఁ జూపుచుంట కవితారచనంబున సాయమిచ్చుటల్
కోరినవంటకంబు సమకూర్చుట దివ్యమహత్వ తత్త్వముల్
కూరిమితోడఁ జూపుటలు క్రొత్తలుగావు కవీంద్రపాళికిన్॥ 33

గీ॥ ఎంత శాస్త్రపరిజ్ఞాన మొసఁగియున్న
ధర్మనీతిప్రబోధలఁ దఱచియున్న
సార్థకంబైన నీకృప నందకున్న
నెగడునే? ధీబలంబు వాణీ! మదంబ! 34

గీ॥ 'వాణి నారాణి,' యంచు గర్వమునఁ జెప్పి,
కొనియెఁ బినవీరభద్రుండు ఘనతమీర
ననుచు వాదాడనేల? నీయాదరమును
గాంచువారికి నీలీల గాననగును॥ 35

గీ॥ ఎట్టిపుణ్యంబుఁ జేసెనో పృథ్విలోన
'సకలసద్గుణనికురుంబ శారదాంబ'
యనుచుఁ బిల్చినయంతఁ బ్రత్యక్షమగుచు
వరలె శ్రీనాథకవిసార్వభౌమకృతికి॥ 36

ఉ॥ ఆ పినవీరభద్రకవి యంతటివాఁ డొకభాగ్యశాలి దీ
క్షాపరతంత్రుఁ డన్నిఁట లసత్ప్రతిభాఢ్యుఁ డదృష్టవంతుఁ డు
ద్దీపితమూర్తి కానియెడ దేవి సరస్వతి కానుపించి కాం
క్షాపరిపూర్తి సేయునె? జగంబున మేటియశంబు నిల్వఁగన్॥ 37

ఉ॥ వేములవాడభీమకవి వీర మహత్త్వ పటుత్వ తత్త్వ తే
జోమహిమంబు నేఁటికిని జోద్యముగాఁ దలపోయుచుందు ము
ద్దామగరిష్ఠుఁడై సుకవితా రచనా ప్రతిభా సమర్థుఁడై
యీమహిలో నపారనుతి కెక్కినధీరుఁడు వాక్పవిత్రతన్॥ 38

గీ॥ ప్రౌఢకవి మల్లనార్యుని వాగ్విశేష
వైభవోన్నతిఁ జెప్ప నెవ్వారితరము?
అట్టి మహనీయునకుఁగాక యెట్టివారి
కంబ భారతీదేవి ప్రత్యక్షమగును?॥ 39

గీ॥ జ్ఞానవాశిష్ఠ కావ్య నిర్మాణఘనత
మడికిసింగనార్యకవి వాఙ్మధురిమంబు
చెప్పకయెచెప్పు నట్టి వాక్ఛ్రీలకాంతి
భారతీకృపాభాగ్య వైభవముగాదె?॥ 40

ఉ॥ తిక్కన పాపరాజ కవిధీరుల వాగ్వభవంబు దేవి స
వ్యక్కళకాంతియంచుఁ గొనియాడఁగ నేటికి? శ్రీసరస్వతిన్
మిక్కిలిభక్తితోఁ గొలువ నేర్చినవారికి లోపముండునే?
యెక్కువమాటలేల? తరియింపరె నన్నయ శంభుదాసులున్॥ 41

గీ॥ ఆసరస్వతీ శ్రీవీక్ష ణాదరమునఁ
గాకయున్నచో నేరీతి ఘనత కెక్కు?
ముక్కుతిమ్మకవీంద్రుని ముక్కుపలుకు
పెద్దనార్యకవీంద్రుని పెద్దతనము॥ 42

ఉ॥ అందఱి దొక్కయెత్తుగ మహాకవిపోతన దొక్కయెత్తుగా
నెందమునందు నెంచెద; దృఢీకృతభక్తిఁ గలట్టివాఁడు; లో
నందముఁ జందముల్ దనరునట్టిది భాగవతంబు దానితో
నెందును సాటిరావు కృతులేవియు వేయి వచింప నేటికిన్॥ 43

ఉ॥ బమ్మెరపోతరాజకవివర్యుఁ డదెక్కడ? మాటలాడుచో
నిమ్మగ నొక్కమాట వచియింపఁగలేని మదీయశక్తి లే
శమ్మది యెక్క డెయ్యెడల సాటిగనిల్చునె? పూర్వపుణ్య భా
గ్యమ్మునఁ గాక వేఱొకటఁ గాంచఁగ నేర్తునె? శ్రీసరస్వతీ॥ 44

ఉ॥ ఏసతిలావు లేక నరులెవ్వరు నోరుమెదల్ప లేరు ప
ద్మాసన వాసుదేవ నిటలాక్షులు సృష్టియు రక్షయున్ లయం
బేసతియూఁత లేక తమ రింతగఁ జేయఁగఁ జాల, రట్టి వా
ణీసతి మన్ముఖాబ్జమున నిల్చి విశేషవరంబు లీవుతన్॥ 45

(భో జ రా జీ య ము.)

శా॥ పుట్టంబుట్ట శరంబునన్ మొలవ నంభోయానపాత్రంబునన్
నెట్టన్ గల్గను గాలిఁ గొల్వను బురాణింపన్ దొరంకొంటి మీఁ
దెట్టే వెంటఁ జరింతుఁ దత్సరణి నా కీవమ్మ యోయమ్మ మేల్
పట్టున్ నాకగుమమ్మ నమ్మితిఁజుమీ బ్రాహ్మీ దయాంభోనిధీ!॥ 46

శా॥ తల్లీ! నిన్నుఁ దలంచి పుస్తకము చేతంబూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బలుకుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ పూర్ణేందుబింబాననా!॥ 47

ఉ॥ క్షోణితలంబునన్ నుదురుసోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ చిత్తవశీకర నైకవాణికిన్
వాణికి నక్షదామశుక వారిజపుస్తక రమ్యపాణికిన్॥ 48

ఉ॥ శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామర సామరవాహినీ శుభా
కారతనొప్పు నిన్ను మదిఁగానఁగ నెన్నఁడు గల్గు భారతీ!॥ 49

ఉ॥ అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారదచంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణరత్న దీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ భా
వాంబరవీధి విశ్రుతవిహారిణి నన్ గృపఁజూడు భారతీ॥ (భాగవతము)

సీ॥ ప్రణవపీఠమున మంత్ర పరంపరలు గొల్వ
నుండు నేదేవి పేరోలగంబు
భావజ్ఞులకుఁ బరా పశ్యంతి మధ్యమా
వైఖరు లేదేవివర్ణసరణి
జప హార కీర పుస్తక విపంచి సమంచి
తంబు లేదేవి హస్తాంబుజములు
కుందేందు మందార కందళీ బృందంబు
చంద మేదేవి యానందమూర్తి
గీ॥ కాంచె నేదేవి కాంచనగర్భు చతుర
పూర్వ దంతకవాట విస్ఫుటమనోజ్ఞ
చంద్రకాంత శిరోగృహస్థల విహార
మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు॥ (జైమినిభారతము)

చ॥ కలకలఁ గేలిచిల్క పలుకం బలుకం దళుకొత్తు నెమ్మితోఁ
బులకల మేను దేలగిలఁ బొంగుచు బంగరువీణెఁ దానపుం
గులుకులు రాల్చి నవ్వఁ జనుగుబ్బలతాఁకునఁ జొక్కఁజేయు నా
పలుకులకల్కి నిచ్చలును బాయక నామదినిల్చుఁగావుతన్॥ (హరిభట్టు)

సీ॥ రాజీవభవుని గారాపుఁ బట్టపుదేవి
యంచబాబా నెక్కి నలరుఁబోఁణి
పసిఁడికిన్నెరవీణెఁ బలికించు నెలనాఁగ
పదునాల్గువిద్యల పట్టుఁగొమ్మ
యీరేడుభువనంబు లేలు సంపదచేడె
మొలకచందురుఁ దాల్చు ముద్దరాలు
వెలిచాయ కోదమరాచిలుక నెచ్చెలికత్తె
ప్రణవపీఠిక నుండు పద్మగంధి
గీ॥ మందరాచలకందర మధ్యమాన
దుగ్ధపాథోధి లహరి కోద్భూతమైన
లలిత సాహిత్య సౌహిత్యలక్ష్మి నొసఁగు
వరదయై మాకు వినతగీర్వాణి వాణి॥ (భీమఖండము)

సీ॥ సింహాసనము చారు సితపుండరీకంబు
చెలికత్తె చెలువారు పలుకుఁజిలుక
శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు
పసిఁడికిన్నెరవీణ పలుకుఁదోడు
నలువ నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు
తళుకుటద్దంబు సత్కవులమనసు
వేదాదివిద్యలు విహరణస్థలములు
చక్కనిరాయంచ యెక్కిరింత

గీ॥ యెపుడు నేదేవి కాదేవి యిందు కుంద
చంద్ర చందన మందార సారవర్ణ
శారదాదేవి మామకస్వాంతవీధి
నిండువేడుక విహరించుచుండుఁగాక॥ (నైషధము)

గీ॥ కంఠపట్టిక నోంకారఘంట మెఱయఁ
జెలఁగుఁగావుత మన్మనఃక్షేత్రసీమఁ
గవికుటుంబంబుపాలిటి దివిజసురభి
జలజసంభవుబోటి భాషావధూటి॥ (కాశీఖండము)

క॥ వాణికిఁ బురాణిఁ బుస్తక
పాణికి శుకవాణిఁ గమలభవురాణి గుణ
శ్రేణి నలివేణి నుతగీ
ర్వాణికిఁ గల్యాణిఁ గొల్తు వాక్చాతురికిన్॥ (రుక్మాంగదచరిత్ర)

చ॥ అనిశము శారదాంబకు మదంబకు సర్వజగద్విడంబకున్
ఘనకరుణావలంబకు విఖండిత ఘోరవిపత్కదంబకున్
వినుత కలా కలాప ముఖవిభ్రమ నిందిత చంద్రబింబకున్
బ్రణుతులొనర్తు మత్కృతికి భవ్యసమృద్ధికి వాక్ప్రసిద్ధికిన్॥ (వీరశరభకవి)

ఉ॥ మేలిమి మంచుకొండ నుపమింపఁగఁజాలిన యంచనెక్కి వా
హ్యాళి చరించివచ్చు చతురాస్యు నెదుర్కొని నవ్వుదేరఁగా
వాలికసోగకన్నుల నివాళియొసంగి ముదంబుసేయు నా
బాలశశాంకశేఖరి కృపామతి భారతి యిచ్చు నిష్టముల్॥ (మొల్ల)

చ॥ తన హృదయాంబుజాతమునఁ దార్కొను నాథగతానురాగవా
హిని వెలిఁగ్రమ్మఁజేసెనొకో యీగతి నాఁగ విధాతచెంగటన్
దనరి జపాప్రసూన సవిధ స్ఫటికాకృతి రక్తిఁగుల్కు వా
గ్వనజదళాక్షి మాకొసఁగుఁగాత వచోరచనాచమత్కృతుల్॥ (పాపరాజు)

శా॥ వీణాపుస్తకపాణి షట్పదలసద్వేణిన్ బృహత్సైకత
శ్రోణిన్ బద్మజురాణి సర్వసుగుణక్షోణిన్ బురాణి న్నతేం
ద్రాణి న్నేత్రజితైణిఁ బాదగతగీర్వాణిన్ బ్రవృద్ధాశ్రిత
శ్రేణి న్వాణి నభీష్టసిద్ధికి మదిన్ సేవింతు నశ్రాంతమున్॥ (గోపీనాథకవి)

సీ॥ రమణీయతర పదార్థ ప్రకాశనిదాన
భాస్వత్ప్రసాద సంపద వహించి
పటుసా సానంద ఘటనైకచాతుర్య
ఘనకృతాలంకార కలన మెఱసి
యనుకూల కాలకంఠాకుంఠ కలనాద
వలమాన మంజులధ్వనుల నలరి
యతివేల కవిజాల కామోద నాపాద
కారణ రసభావగరిమ నెనసి
గీ॥ పరమయుతియోగ సంస్థానపద మనోజ్ఞ
వైభవోన్నతిఁ దగు సరస్వతి మదీయ
మానసస్థాన మందిర మధ్యవీథి
నిండుకొలువుండుఁగాక నిష్ఖండలీల॥ 61

(చంద్రికాపరిణయము, శ్రీరాజాసురభిమాధవరాయకృతం)

గీ॥ అనుచుఁ గవులెల్ల నిన్ గొనియాడుచుందు
రాయురారోగ్య భోగభాగ్యముల నిచ్చు
బ్రహ్మదేవుని రాణివై పరలుచుంట
నీదు కృపలేనిజన్మంబు నిష్ఫలంబు॥ 62

గీ॥ "ఇంచువేడుక వీణ వాయించుచెలువ
నలువరాణి మదాత్మలో వెలయుఁగాత"
మనెడు పెద్దన్నవాక్య మత్యంతఘనము
ధన్యతను గాంచఁజేయు మోతల్లి! నన్ను॥ 63

ఉ॥ పావనమైన యీసురభివంశముఁ జొన్పుట, యంమరాజ్ఞియున్
భూవరుఁడున్ సరస్వతియుఁ బోల్పసలారఁగ గారవించి స
ద్భావముచొప్పునన్ గురుపదంబున నిల్పుట నీదు దివ్యతే
జోవిభవంబు నన్నుఁ బరిశుద్ధునిఁ జేయుటగాదె భారతీ॥ 64

క॥ ఇమ్మగ నీకు కృపా స్నే
హమ్మునఁగా లభ్యమయ్యె నంచితసుకృతం
బిమ్మహి ధన్యుఁడనైతిన్
సమ్మానము వచ్చె రాజసన్నిధులందున్॥ 65

సీ॥ వైరి విశ్వంభరావర వర్గ సన్నుత
శౌర్యభూషణులు రేచర్లవారు
నాగేశ వాగీశ నాకేశగురు నుత
సాహిత్యధనులు రేచర్లవారు
మందార కుందారవిందాది నీహార
సత్కీర్తియుతులు రేచర్లవారు
గురుదాన జిత శిబి సురధేను రవిసూను
చందనతరులు రేచర్లవారు
గీ॥ అట్టి రేచర్లగోత్రమ్మునందు వెలయు
రత్నమాంబామహారాజ్ఞి రమ్యకరుణఁ
గాంచి జటప్రోలుసంస్థాన కవిగ నుంట
శారదాంబ! నీ ఘనకృపాసరణి గాదె?॥ 66

సీ॥ పెంచె నేకాశ్యపీవిభుఁడు బిడ్డలవోలెఁ
దనరాజ్యమందున్న జనుల నెల్ల
నించె నేవైభవనిర్జరేశుం డర్థి
కోటిహృద్గతములౌ కోర్కెలెల్లఁ

ద్రుంచె నేరాజచంద్రుఁడు పండితకవివ
రేణ్యుల నేచు దారిద్ర్యమెల్ల
ముంచె నేభూపోత్తముఁడు నైజకీర్తి సు
ధావార్ధి లోకసంతతుల నెల్ల
గీ॥ నట్టి రసికవతంసంబు నతులకీర్తి
సురభి వేంకటలక్ష్మరాడ్ధరణినాథు
కృపకుఁ బాత్రునిఁగాఁగ న న్నివ చేసి
నట్టిమేలెల్ల మఱువంగనగునె? తల్లి!॥ 67

ఉ॥ కొల్లలుగాఁగ దీనజనకోటికిఁ గామ్యము లీయఁజాలు దీ
వ్యల్లతికామతల్లి మదుపాస్యనిరీతిగ సాకుతల్లి; య
ల్లల్లన నాంధ్రచారు కవితాంగన నేలెడు పాలవెల్లి మా
కొల్లపురంపుఁదల్లి నెదఁ గొల్చెదఁ భాగ్యమునిమ్ము భారతీ। 68

సీ॥ నీమూలమునఁగాదె భూమీశ లక్ష్మణ
వర్యునితో స్నేహభావ మొదవె
నీమూలమునఁగాదె శ్రీమన్మహారాజ్ఞి
రత్నమాంబాకృప ప్రబలుచుండె
నీమూలమునఁగాదె నిర్మలానంద సౌ
ఖ్యమ్ము నాకెల్లప్డు నమరుచుండె
నీమూలమునఁగాదె స్నేహలతాసంఘ
మవనిలో విఖ్యాతి నందుచుండె
గీ॥ నిన్నుఁ జూచుటఁగాదె నా కెన్నరాని
మిత్ర సౌభాగ్యసంపత్తి మిగులుచుండె
రాజ కవిరాజ బాంధవ్య మోజఁ దనరెఁ
ద్వత్కృపారతియే గతి బ్రహ్మరాణి॥ 69

గీ॥ త్వత్కథా శ్రవణాసక్తి త్వత్పదాబ్జ
సేవయెడ రక్తి త్వన్నామ చింతనమున
భక్తి త్వన్మూర్తిదర్శన ప్రాప్తి ధాత్రి
నాకు లభియించె నీకృప నలువరాణి!॥ 70

గీ॥ నిన్నుఁగాదని యెదిరించి నిల్వఁగలఁడె
ధాతయైనను వాని ముత్తాతయైన
నీవులేకున్న నెవ్వారు నిల్వఁగలరు?
ప్రాణధాత్రివి నీవమ్మ భారతాంబ!॥ 71

గీ॥ నిన్నుఁగొల్చెడు భాగ్యంబు నెగడకున్న
నిన్ను వర్ణించు సుకృతంబు నేర్వకున్న
నిన్ను దర్శించి పుణ్యంబు నెఱయకున్నఁ
"గలుగ నేటికిఁ దల్లులకడుపుచేటు"॥ 72

గీ॥ భీమకవివోలె వాక్సిద్ధి వెలయకున్నఁ
బ్రాక్కవులువోలె ధీశక్తిఁ బడయకున్న
సుబ్బరాయనివాక్కు లెచ్చోటనైనఁ
దల్లి! నీకటాక్షమ్మునఁ దనరనిమ్ము॥ 73

శా॥ ముక్తిన్ గోరి భవత్పదాబ్జయుగళిన్ ముప్పొద్దు ధ్యానింతు నా
సక్తిన్ గాంచి భవన్మహామహిమముల్ సద్గ్రంథముల్ దెల్పఁగా
భక్తిన్ గాంచి పఠింతు నొక్కక్షణమున్ వ్యర్థంబుగా గెంట నీ
వ్యక్తిన్ నీవ యెఱుంగవా కొంక జననీ! వ్యాఖ్యాన మింకేటికిన్॥ 74

చ॥ అరమరలేక నన్నిఁకఁ గృపార్ద్రమనమ్మున నేలుమమ్మ నా
తెఱఁగెఱిఁగించి యెంతయు నతిప్రమదంబున కాస్పదంబుగా
వరలెడు నీపదాంబుజ మవశ్యముఁ గొల్చెడుశక్తి నిచ్చి యే
కొఱఁతయుఁ గల్గనీయక యకుంఠితవత్సలతన్ ఘటింపుమా॥ 75

ఉ॥ నీదు కృపావిభూతి నిల స్నేహలతా కవిసంఘ వృక్షమున్
శ్రీ దయివారునట్లు వికసింపఁగ నాటితిఁ గావ్యపుష్పముల్
మోదముఁగూర్చు నాకవనమున్ బలె నల్లుకొనెన్ జగమ్మునన్
మేదిని నేలు రాజకవిమిత్రులకెల్లను నీడయో యనన్॥ 76

ఉ॥ విద్దెలపారమున్ గనిన విజ్ఞుఁడఁగాను సమస్తధర్మముల్
దద్దయు నేర్చినట్టి గుణధన్యుఁడఁగాను వివేకిఁగాను ము
ప్పొద్దులఁ ద్వత్పదాంబుజమె ముక్తికి భుక్తికి హేతువంచు నా
ముద్దులపోకలా సుతులముువ్వురతో సతితో భజించెదన్॥ 77

చ॥ పలికియెఱుంగ నెన్నఁడును బల్కఁగరాని కఠోరవాక్యముల్
సలిపియెఱుంగ నెన్నఁడును సాధులుమెచ్చని దుష్టకార్యముల్
తలఁచియెఱుంగ నెన్నఁడును ధర్మముఁదప్పు తలంపు నీపదం
బులె శరణంబులంచు సతమున్ మది నెంచితి నో సరస్వతీ॥ 78

చ॥ కలఁగనువేళలం దెపుడుఁ గాంచుచునుందు భవత్స్వరూపమున్
జలనములేని చిత్తమున సాగెడువాఁడను సూనృతవ్రత
స్ఖలన మెఱుంగఁబోని కవిసంతతిలోపల నుండువాఁడ నే
ఫల మెసఁగంగఁ జేసి ననుఁ బాలనసేయుదొ శ్రీసరస్వతీ॥ 79

ఉ॥ మున్నొనరించు నాదురితమూలము మూలముతోడఁ ద్రుంచి యా
పన్నుని నన్నుఁ బ్రోచి భవబంధములోఁబడి ప్రుగ్గకుండ నీ
ప్రసన్నని పాదముల్ గొలుచుభాగ్యముఁ గల్గఁగఁజేయుమమ్మ నా
కన్నిఁట నీవె తోడ్పడిన నందఁగరాని ఫలంబులుండు నే?॥ 80

ఉ॥ అమ్మ! భవత్కటాక్షలవమైనను నాపయి సోఁకనిమ్మ! జ
న్మమ్ము కృతార్థతన్ బడయుమార్గమునన్ నడిపింపుమమ్మ! నే
రమ్ముల సైపుమమ్మ! యనురాగరసంబును జిల్కుమమ్మ! జ్ఞా
న మ్మెసఁగంగనిమ్మ! యొకనాఁడును బాయకుమమ్మ భారతీ॥ 81

ఉ॥ దీనులనెల్లఁ గాచు పరదేవివి నీవు సుతుండ నేను నీ
ధ్యానముసేయు భక్తుఁడ నుదాత్తమతిన్ నినుఁగొల్తు సౌఖ్యసం
ధానమొనర్చి కావఁగలతల్లివి చల్లని దృక్పరంపరా
ధానవిభూతి నాపయి సతంబును నిల్పి తరింపఁజేయుమా॥ 82

ఉ॥ ఎగ్గుఘటించువేళ స్మరియింతునటంచు సమస్తభాగ్యముల్
తగ్గనినాఁడు నీపదములన్ స్మరియింపనటంచు నీకృపా
దృగ్గరిమంబు నాపయి నొకించుక చూపుట మానకమ్మ! లో
సిగ్గు ఘటింపకమ్మ! భవసింధువు దాటఁగఁజేయు మంబికా॥ 83

మ॥ ధరణీదేవులు వేదవేత్తలు నినున్ దర్శింపలే రన్నచో
స్థిరకాంతిప్రదమై మనోహరమునై చెల్వొందు నీరూపమున్
బరులెవ్వారలు గాంచనేర్తు రిల భాస్వచ్ఛక్తివౌ నిన్ను నే
స్థిరచిత్తమ్మునఁ గొల్చుచుంటి జననీ తీరంబుఁ జేర్పంగదే?॥ 84

శా॥ కన్నుల్ గల్గియు లేనివారిపగిదిన్ గాంచంగలే రెద్దియున్
నిన్నున్ భక్తిఁగొల్వనేరనిజనుల్ నిక్కదరి చిద్రూపిణీ
విన్నన్ జాలు భవన్మహత్వ మెపుడున్ విజ్ఞానిబృందంబులో
నున్నన్ జాలుఁ దరించి మించఁగల రీయుర్విన్ యశఃకాములై॥ 85

ఉ॥ తొల్లి నినున్ భజించి సుగతుల్ గనుమార్గములెల్లఁ గాంచుచున్
జల్లఁగ మానులెల్ల సువచఃకలనంబున స్యతసంధులై
చల్లని నీదయాదృతికిఁ జాలిరి, నేనన నెంతవాఁడ? సం
ధిల్లినభక్తితోడ భవదీయపదంబులఁ గొల్తు శారదా॥ 86

శా॥ ఎన్నంజాలుదు నీపదాబ్జయుగమే హెచ్చైనభావమ్ముతో
మన్నింపన్ వలె నాదోసంగులను యుష్మద్దివ్యనామాళి నే
యెన్నంజాలు మదీయజిహ్వయును నీవే దిక్కు నాకింక నీ
కన్నం బ్రోచెడితల్లి లేదు మహిలో నంబా! జగన్మోహినీ॥ 87

చ॥ ప్రథితమనమ్ముతో నిను నవశ్యము నమ్మినవాఁడ, ధాత్రిలో
శిథిలములేని కీర్తిరమఁ జేకొనుభాగ్య మొసంగి మన్మనో
రథమును దీర్పుమమ్మ! కవిరాజులు మెచ్చెడిబుద్ధి నిమ్మ? స
త్పథమును సత్ప్రవర్తనముఁ బాయనిభక్తుఁడ సుబ్బరాయఁడన్॥ 88

ఉ॥ క్రిందుగఁ బూర్వజన్మకృతకర్మముఁబట్టి ఫలంబుఁగల్గు, నిం
పొందెడు పుణ్యకార్యములు నొప్పెడిరీతినిఁ జేయకున్నచో
నందనిమామిడిపండ్లకొఱ కఱ్ఱులుసాచుట యౌనుగాదె? యే
చందమునన్ దరింపఁగల శక్తి నొసంగెదొ శ్రీసరస్వతీ॥ 89

ఉ॥ ఇంతకుమించి మిన్నొకఱయునెట్టితలం పెదలేదు నాకు ర
వ్వంతయు, నీపదాంబుజమె ధ్యానముసేయుచు నున్నవాఁడ ని
శ్చింతమనమ్ముతో దరికిఁ జేర్చెదవంచు, నుపేక్షసేయుచో
శాంతి లభించుటెట్లు? భవసాగర మీఁదుటయెట్లు లంబికా!॥ 90

ఉ॥ నిన్నుభజింతు నెల్లపుడు, ని న్నెదనెంచుచునుందు, నీపదం
బెన్నఁడువీడకుందు, క్షణమేనియు బద్ధకమూనఁబోను, నీ
వన్నిఁట సాయమిచ్చు జగదంబవుగాదొకొ? నీదు భక్తిసం
పన్నుల కందరాని ఫలభాగ్యము లుండునె? శ్రీసరస్వతీ॥ 91

ఉ॥ ఎన్నఁటికైన నీపదము లెన్నఁడువీడని భాగ్య మిమ్ము, నా
కెన్నఁడుఁ దగ్గనట్టి బలమిమ్ము, భవత్కథలెల్ల జిహ్వలో
నున్న రజోగుణంబు సరసోక్తిగ మారెడురీతి దీక్షతో
నెన్నుటకై పరాంబ! వరమేటికి? నీకృప యున్నఁజాలదే?॥ 92

చ॥ రవి యుదయించినంతట బిరాబిరఁ జీకటులెల్లఁ బాయున
ట్లవిరళతేజమున్ బఱపినంతట నాతమమున్ నశించుఁ, ద
త్త్వవిభవ మే నెఱుంగఁగల ప్రాజ్ఞుఁడఁగాను ద్వదీయనామ సం
సవమొనరించువార లిల ధన్యులుగారె? ప్రబుద్ధభారతీ॥ 93

ఉ॥ అంబ! నినున్ భజించునరులందఱుఁ బ్రాకట ధర్మకామమో
క్షంబులు నర్థసంపదలు సర్వశుభంబులు భోగభాగ్య సౌ
ఖ్యంబులు గాంచనేర్తురుగదా చిరజీవులు నీదుమంత్రరా
జంబుఁ దదేకనిష్ఠఁగొని సత్త్వగుణాన జపించువారిలన్॥ 94

ఉ॥ ఎంతటి జ్ఞానమున్న మఱియెంతటి వాగ్వైభవంబులున్న నిం
కెంతటి శక్తియున్నఁ దనకెంతటి ధీబల మొప్పియున్న ని
శ్చింతగ భారతీకథలచేఁ బరిశుద్ధుఁడు గాకయున్న జ
న్మాంతరదోషముల్ తొలఁగునా? తుది మోక్షపదంబు గల్గునా?॥ 95

చ॥ వినినకొలంది వీనులకు వేడ్కగనుండు భవత్కథారుచుల్
కనినకొలంది కన్నులకుఁ గాంక్షజనించు భవత్స్వరూపముల్
కనవినరాని లీలలు జగంబున నీదుకటాక్షజాలముల్
ఘనమగు నీకృపాకలితకాంతులు నాపయిఁ జిల్కు మంబికా!॥ 96

ఉ॥ ఆరయ నేజగజ్జననియాదర మించుక గల్గకున్న నె
వ్వారు విపత్పరంపరలఁ బాల్పడ ముంచుచుఁ దేల్చుచుండు సం
సారపయోధి దాటఁగలశక్తినిఁ గాంచరొ యట్టితల్లికిన్
భారతి కేను మ్రొక్కెద నపారశుభాభ్యుదయంబు గల్గఁగన్॥ 97

మ॥ సురలన్ భక్తి భజించుమానవులకున్ శోభిల్లుసౌఖ్యార్థ ము
ర్వర యున్నన్ బలుమాటలేల? మము సంరక్షింపఁగాఁజాలు నీ
చరణాబ్జంబు భజించువారి కిలలో సాధ్యంబు గాకుండు నే?
చిరసౌభాగ్య చిరాయురున్నతులచేఁ జెల్వొందు భోగార్థముల్॥ 98

ఉ॥ వేకువ లేచి నీహృదయవీథికలో ననుఁ జేర్పుమంచు నీ
శ్రీకరనామమున్ బలికి చిత్తము నీకడఁజేర్చి మ్రొక్కలన్
నీ కిడకుండ నన్యమును నే నొనరింపని భక్తుఁడన్ జుమీ
నా కెటువంటిసౌఖ్యము ఘనంబుగ నిత్తువొ? శ్రీసరస్వతీ॥ 99

ఉ॥ నీకృపఁ గాంచఁబట్టి నిను నిశ్చలభక్తి భజింపఁబట్టి వా
ల్మీకి కవీంద్రుఁడయ్యె, నిను మించినభక్తిఁ బరాశరాత్మజుం
డేకమనస్కతన్ గొలిచి యింపగు భాగవతంబువ్రాసె, నీ
వే కవికోటినెల్లఁ దరియింపఁగఁజేసెదు శక్తి వంబరో॥ 100

మ॥ ధనధాన్యంబులు భోగభాగ్యములు విద్యా ధీబలస్ఫూర్తియున్
ఘనసంపద్విభవాభిరామములు కాంక్షల్ దీరు సంతానముల్
గనినన్ లాభములేదు నీదగు కటాక్షప్రాప్తి లేకున్నఁ, గా
వున నీస్తోత్రముఁ జేసినాఁడఁ గృపతోఁ బ్రోవంగదే భారతీ॥ 101

ఉ॥ ప్రాయము రిత్తఁ బుచ్చితిఁ దపంబు జపంబును లేక కాంక్షలన్
ద్రోయక భోగసౌఖ్యములఁ దూగితి వైదికకర్మనిష్ఠలన్
జేయఁగలేదు సద్గతికిఁజేతులుచాచిన లాభమేమి? నీ
వే యనుకంపఁజూపి తరియింపఁగఁ జేయవలెన్ సరస్వతీ॥ 102

శా॥ నీసంకల్ప మెఱుంగఁజాలము శ్రితానీకమ్ము రక్షించి నా
నాసౌఖ్యంబులు గూర్తు వెల్లపుడు నీనామంబె దిక్కంచు లో
వాసిన్ మీరఁగఁ గొల్చువారి కెపుడున్ భద్రంబులన్ గూర్చుచున్
గాసిన్ దీర్చి యభీష్టసిద్ధి నెలమిన్ గల్పింపవే భారతీ॥ 103

మ॥ జననీ! ప్రేమరసప్రధాన కవితాసామ్రాజ్య సౌభాగ్య సం
జనితానంద కవిత్వతత్త్వ మెలమిన్ సాధించు ధీశక్తి నా
కనుకంపన్ దయసేయుమమ్మ జని ధన్యంబౌనటుల్ సేయుమా
ఘనమా నీదుసహస్రనామములు గాంక్షల్ మీరఁగా నెన్నదన్॥ 104

ఉ॥ వ్రాసితి స్తోత్రపద్యములు భక్తిదలిర్పఁగ నిన్ను నెంచుచున్
వ్రాసితి దీక్షఁబూని సుకరంబుగ నీదుసహస్రనామముల్
వ్రాసితి నిన్ను మించఁగలవారలు లేరని యింతకంటె నే
వ్రాసెడిదేమి సత్కవులవ్రాత విధాతృనివ్రాతయేకదా?॥ 105

ఉ॥ ఆ నలినోదరాంశభవు నంతటివాఁడను గాకపోయినన్
నీ నలినాంఘ్రియుగ్మమును నిశ్చలభక్తిని నమ్మి నీపద
ధ్యానముఁదక్క వేఱొక పదంబు నెఱుంగనివాఁడఁగాన ని
ష్ఠా నిరతిన్ రచించితి రసప్రచురంబగు కావ్య మంబరో॥ 103

ఉ॥ నీరజ సంభవాదులును నిక్కముగా భవదీయతత్త్వమున్
నేరరు, విప్పిచెప్పుటకు నేనన నెంతటివాఁడ, ఘోరసం
సారపయోధిలో మునిఁగి సత్త్వ మెఱుంగనివాఁడ నెట్టులో
నేరములెల్ల సైచి నను నెట్టనఁబ్రోవుము శ్రీసరస్వతీ॥ 107

క॥ నీరూపంబుఁ దలఁతు నీ
పే రెంతు భవన్మహిమను వినుచుందున్ నీ
చారిత్రమెల్లఁ గృతిసొం
పారన్ లిఖియించుచుందు నానందమతిన్॥ 108

ఉ॥ వేడను నన్యదేవతల వేడిన నీవలెఁబ్రేమ పెంపునన్
జూడఁగరారు నీ పరమశోభిత పాదముఁ గొల్చువారలన్
వీడను నీపయిన్ మిగుల నేరముపెట్టెడు దుష్టకోటులన్
గూడను నిన్నె నమ్మితి నకుంఠితభక్తిని శ్రీసరస్వతీ॥ 109

ఉ॥ అంతములేనియట్టి పరమాత్మపదంబును యోగ నిశ్చల
స్వాంతసమాధిఁ బూని కనుభాగ్యముఁ గల్గఁగఁజేయుమీ శరీ
రాంతమునందు మోక్షపద మందఁగనిమ్ము పునర్భవ వ్యథా
క్రాంతునిఁ జేయఁబోకుము జగత్ స్థితికారిణి శ్రీసరస్వతీ॥ 110

శా॥ నీరూపం బెదనిల్పి కొల్తు సతమున్, నిన్నెప్డు సద్భక్తి నీ
కారుణ్యం బొకఁడున్నఁ జాలుననుచున్ గావింతు స్తోత్రంబు, నీ
పేరన్నన్ గడుఁబొంగుచుందు నెదలోఁ బ్రేమించి కామించి త
ల్లీ! రావే! దయనేలవే? సుఖమునాకీవే! ననున్బ్రోవవే?॥ 111

ఉ॥ ఏ యుపచారమున్ సలుప నెన్నఁడు నోకొఁడ బుద్ధిహీనతన్
జేయుదొ సంగులన్ సయిచి చేకురఁజేయుము సౌఖ్యసంపదల్
జాయకు నాకుఁ బుత్రులకు, సాగిలి మ్రొక్కుచునున్నవాఁడ నీ
వే యనుకంపఁజూపవలె నెప్పుడుఁ దల్లిరొ! శ్రీసరస్వతీ॥ 112

గీ॥ ఓసరస్వతీ నీకృప యుండఁబట్టి
కలముఁ జేపట్టి తలపెట్టు కార్యమెల్ల
నించుకంతయు లోటు గన్పించకుండ
సాగుచుండెను సర్వత్ర జయముగాఁగ॥ 113

గీ॥ నీ కృపాప్రాభవంబున నేఁడుఁగూడఁ
దల్లి! నిన్గూర్చి వ్రాయుపద్యంబులెల్ల
సార్థకముఁ జేయఁగదవమ్మ సత్వరముగ
వాఙ్మయ ప్రపంచమ్మున వరలునట్లు॥ 114

శా॥ నీమాహాత్మ్యముఁ గ్రొత్తఁజేసి నుడువన్ నేర్పింతలేకున్న నా
లో మాఱ్ఱ్మ్రోగుచు నుండు నెల్లపుడు నీలోనున్న తేజంబు, నీ
వే మాకెల్లెడ దిక్కటంచు నెదలో నెవ్వేళ నూహింతు, నీ
శ్రీమాన్యాకృతిఁ జూచుభాగ్య మొదవన్ బృథ్వీతలంబందునన్॥ 115

ఉ॥ నేను జపాగ్నిహోత్ర మహనీయతఁ గాంచినవాఁడఁ గాను బ్ర
జ్ఞానిధిఁ గాను ధీయుతుఁడఁ గాను గవిత్వపటుత్వతత్త్వరే
ఖా నియతిన్ బురాకృత సుకర్మవశమ్మున నేర్చినంత ని
న్నేను నుతించుచుంటిఁ గృతకృత్యునిఁ జేయుదువంచు భారతీ॥ 116

ఉ॥ కావున నాదుచిత్తము వికారము నొందఁగనీక కాచి స
ద్భావముతోడ నాత్మ పరిపక్వముఁగాంచెడు తత్త్వరూప వి
ద్యావిభవంబు బోధపడునట్టులఁ దేటపడన్ బొనర్పు మో
దేవి! ప్రబుద్ధశారద! తుదిన్ నినుఁజేరి సుఖంబుఁగాంచఁగన్॥ 117

క॥ నీకంటెఁ గాచువారలు
నాకెందున లేరుగాన నాధారము నీ
దే కైవల్య ప్రాప్తికి
నీకైంకర్య మొనరింతు నిష్ఠానియతిన్॥ 118

ఉ॥ ఇంచుక మాయలేక జగమెల్ల భవన్మయమంచు నెంచి ని
న్నంచిత భక్తి పెంపున నిరంతరమున్ భజియింతు, నేను గా
వించెడు కార్యమందుఁ గనుపించిన దోసములెల్లఁ గప్పి లా
లించుము సత్కృపారతిఁ గలిన్ బడకుండఁగ నోసరస్వతీ॥ 119

చ॥ తెలియక కొన్ని యాపయిన దిట్టతనంబునఁ గొన్ని బుద్ధియున్
గలిగినవెన్కఁ గొన్ని మఱి జ్ఞానము చాలక కొన్ని తప్పులన్
సలిపితిఁ దత్ఫలం బిపుడు చాలఁగఁ బొందితి నింకనైన న
న్నలసటఁ బెట్టకుండఁ గనుమమ్మ! సరస్వతి నీకు మ్రొక్కెదన్॥ 120

ఉ॥ స్థాపనఁ జేసితిన్ గవనసంఘము కొల్లపురమ్మునందు నీ
ప్రాపు లభించెనంచు నెటు వర్ధిలఁ జేసెదొ ధాత్రిలోన, నే
నేపుగ మిత్రలేఖ లభివృద్ధిగఁ జేసితి, నిన్ను నమ్మితిన్
నీపటుశక్తి ముందునకు నెట్టఁగ నోవని శ్రీసరస్వతీ!॥ 121

చ॥ కలమును బట్టినంత బుధకాండము మెచ్చెడు మేటిశక్తి నా
కలవడఁ జేసినావు మనమందున బద్ధకమెల్లఁ బోవె ని
ర్మలమగు చిత్త మేర్పడె సమస్తముఁ జేకుఱఁగఁ గానవయ్యె నీ
బలము లభించువారల కపారసుఖంబులు గల్గు భారతీ॥ 122

శా॥ పాపంపుం నుడులేల నీకృపయు నాపైనుంట నాస్థానముల్
ప్రాపించెన్ శుభముల్ ఘటిల్లె ధన మాపాదింపఁగానయ్యె ని
ష్పాపుం గా నొనరించి సత్కృతులు సల్పన్ జేసి సౌఖ్యంబు నా
కేపారన్ యశ మింతగాంచితిని బ్రాహ్మీ! సత్కృపాంభోనిధీ!॥ 123

శా॥ శ్రీరమ్యంబగు నీకటాక్షవిభవ శ్రీకాంతి చేకూరఁగాఁ
బ్రారంభించినదాది విఘ్నలవమున్ రానీక పోషించుచున్
గారుణ్యంబునఁ జూచుచుంటి వెపుడున్ సంఘంబు వర్ధిల్ల వి
స్తారామోదము వెల్గుచుండె నెదలోఁ దల్లీ! దయాంభోనిధీ!॥ 124

గీ॥ "ప్రాయ మించుకేనియును గైవాలకుండ"
నైషధగ్రంథ రచితసందర్భమందుఁ
బలుకుఁదోడైతి శ్రీనాథ భవ్యకవికిఁ
గవులపాలిఁటి కల్పవృక్షంబ వగుట॥ 125

గీ॥ ప్రాయ మించుక నాకుఁ గైవ్రాలుచుండ
దర్శనంబిచ్చి నీపైనఁ దనివిదీఱ
భారతీగ్రంథ నిర్మాణవైభవంబుఁ
గలుగఁజేసిన తల్లివి నలువరాణి!॥ 126

గీ॥ రాజసంస్థాన మర్యాద ప్రబలునట్లు
నన్ను శ్రీ యిందిరా జగన్నాథరాజ
దంపతులు దేశికునిఁజేసి తన్పుచుంట
త్వత్కటాక్షమ్ము చేఁగాదె భారతాంబ!॥ 127

గీ॥ చెప్ప నేటికి? నినుగంటి శ్రీసరస్వ
తీసతీ కవిత్వరచ నాభ్యాసమునకు
గురుపదంబు నాకిచ్చు నీకరుణఁ దల్లి!
మఱువశక్యంబె? కోటిజన్మములకైన॥ 128

గీ॥ శిష్యగణ మెల్లవేళ నీసేవఁ జేయు
నాకళత్రంబు నీగాథ నయమెసంగఁ
జేసి నోరూర నోరారఁ జెప్పుచుండుఁ
దత్పదాబ్జ సేవారతి ప్రబలునట్లు॥ 129

క॥ చేతోమోదం బొప్పఁగ
సీతాకల్యాణకృతికిఁ జేదోడై వి
ఖ్యాతిన్ గూర్చితి మఱువన్
మా తరమా? తల్లి! పెక్కుమాట లిఁకేలా?॥ 130

గీ॥ శిష్యురాలగు చేబ్రోలు శ్రీసరస్వ
తీ విరచిత రామాయణ దివ్యకావ్య
మునకుఁ బ్రోత్సాహమిచ్చు నీఘన కృపార్ద్ర
దృగ్విలాసోదయంబుఁ గీర్తింపఁగలనె?॥ 131

గీ॥ రెండువేలపద్యంబుల నిండియుండు
ప్రేమసందేశకావ్యంబు నేను మొదవ
వ్రాయఁగల్గెడు భాగ్యంబు వరలెనన్నఁ
దల్లి! నీ కృపాభ్యున్నతాదరముగాదె?॥ 132

గీ॥ క్రమముగా విశ్వవిద్యాధికారులెల్లఁ
బాఠ్యపుస్తకములుగ నాప్రబంధములను
నిర్ణయించు ప్రోత్సాహమ్ము నెగడెననినఁ
జెప్ప నేటికి? నీదయా శ్రీబలంబు॥ 133

ఉ॥ ఆ యినుగంటి కృష్ణవసుధాధిపు జీవితగాథ భక్తితో
వ్రాయఁగ లక్ష్మరాయనృపవర్యుని జీవితతత్త్వ మంతయున్
వ్రాయఁగఁ బెక్కుకావ్యములు వ్రాయఁగఁ దోడ్పడియుంటి వీవు; త
ల్లీ! యిలలోన నన్నుఁ దరియింపఁగఁ జేసితివమ్మ భారతీ॥ 134

ఉ॥ వ్రాసియెఱుంగ నెన్నఁడును వ్రాయఁగరాని కఠోరవాక్యముల్
వ్రాసినవాఁడఁగాను నొకపట్టుననైన నధర్మవాక్యముల్
వ్రాసినవ్రాఁత లన్నియును వన్నెయువాసియుఁ గాంచురీతిగాఁ
జేసిన నీదయారస విశేషము వర్ణనసేయ శక్యమే?॥ 135

గీ॥ పాడువ్రాఁతల నెన్నండు వ్రాసియెఱుఁగఁ
దిట్టుపద్యంబు లేనాఁడుఁ దీర్చియెఱుఁగఁ
గోపభావంబు లేవేళఁ జూపియెఱుఁగఁ
దల్లి! నీకటాక్షమ్మె నా కెల్లదిక్కు॥ 136

చ॥ "మృదుమధురప్రసంగముల మించు కవిత్వము మిత్రలేఖలన్
బొదిగెడు నేర్పు మీకుఁ బరిపూర్తిగఁ జిక్కె" నటంచు వ్రాసె స
మ్మదమున శ్రీభుజంగకవిభూపతి; యీసుకృతంబు నీకృపా
భ్యుదయ పరంపరాతిశయముల్ ప్రసరించుటఁగాదె భారతీ!॥ 137

ఉ॥ రాజగు విశ్వసుందరుఁడు ప్రాణసఖుండయి చిత్రలేఖలన్
రాజిలఁజేసి యెల్లపుడు వ్రాయుటకున్ గలకారణంబు నే
నోజఁ దలంతు నీదగు కృపోన్నతియంచు బహూక్తులేల? నీ
భ్రాజితతేజమున్ గొలుచువాఁడను జీవితశేషమంతయున్॥ 138

గీ॥ "పద్యసరణిని సడలించు గద్యసరణి
గద్యసరణిని వడిమించుఁ బద్యసరణి"
యం చమరశాస్త్రి వ్రాయు వాక్యాళికెల్ల
నగ్వఁగా నొసరించిన యంబనీవ!॥ 139

గీ॥ పీఠికాపుర యువరాజు వినుతిసేయ
వారి కావ్యతరంగ భాస్వత్స్వరూప
వైభవంబు విమర్శించు వాక్కులెల్లఁ
గారణం బీవకా స్వర్ణగర్భరాణి॥ 140

ఉ॥ ఆ వర నూజివీడుపురమందునఁ బావనధర్మశీలుఁడౌ
శ్రీవిజయాప్పరాణ్మణి విశిష్టకృపన్ గురుతన్ వహించుటన్
శ్రీవిభవంబుఁ గాంచుటయు స్నిగ్ధుఁడనౌటయుఁగూడ భారతీ!
నీవ నిదానమౌటఁగద నీకృప సర్వశుభంబు లిచ్చెడిన్॥ 141

గీ॥ మించువేడ్క రత్నాంబ పోషించుచుండ
నా జగన్నాథభూవరుఁ డాదరింప
శ్రీ సరస్వతీమాతయుఁ గృపవహింప
సంఘ మభివృద్ధియగుచుండెఁ జాలవఱకు॥ 142

గీ॥ విశ్వవిద్యాధికారుల వినుతిఁ గాంచి
తొలిబహూకృతి 'గీత' లందున గ్రహించి
కానఁగా గృహలక్ష్మికంకణముఁ గాంచి
పేరుఁగొనుచుంట నీకృపాభిక్ష గాదె?॥ 143

గీ॥ కాశికృష్ణార్య దీవనఁగాంచి మించి
చిలకమర్తి నృసింహుని చెల్మిఁగాంచి
విశ్వనాథుండు సతతంబు వినుతిసేయ
స్నేహలత నాఁడునాఁడు పుష్పించుచుండె॥ 144

గీ॥ నీకటాక్షమ్ము దండిగా నిండియుంట
వేంకటరమణాచార్యుని ప్రేమఁ బడసి
మిత్రలేఖల నడిపించి మించఁగలుగు
భాగ్య మొనఁగూడె నాకు నోభారతాంబ॥ 145

గీ॥ ఆ కవిత్రయభారత మంతఁ జూచి
కృష్ణభారతమున్ విమర్శింప నేర్చి
రెంటిలోపలనున్న సాదృశ్య మెంచి
వృద్ధి యగుచుండెఁ బెద్దవారెల్లఁ బొగడ॥ 146

గీ॥ అయ్యొ విద్వత్పరీక్షలయందు జయము
గలిగెఁ గవిసార్వభౌముని కరుణఁగూడఁ
జెళ్లపిళ్ల వేంకటకవిశేఖరుండు
సిద్ధిఁగలవాఁడనుచు విమర్శించి వ్రాసె॥ 147

గీ॥ నన్నుఁ గవివీరుఁగాఁ జేసి యెన్నఁదగిన
పద్యలేఖను వ్రాసిన పండితుండు
గురుఁడు వేంకటశాస్త్రిని గొల్తునెపుడు
తథ్యముగ నాతఁడే కవితాగురుండు॥ 148

గీ॥ సంఘసభ్యుఁడై మిత్రుఁడై శ్రద్ధఁగలిగి
క్రొత్తమిత్రుండు 'బాలాజి' కూర్మిఁజూపు
పండితారాధ్యమిత్రుండు వ్రాయుచుండు
మిత్రకోటి వందలపైన మించియుండు॥ 149

గీ॥ ఆంగ్లమందు 'శివాజి' వీరాగ్రగణ్య
గాథలెల్లను వ్రాయుభాగ్యంబు గలిగె
నద్ది శ్రీజగన్నాథరాయండు మెచ్చి
ప్రకటమొనరించెఁ గీర్తిచంద్రిక వెలుంగ॥ 150

గీ॥ కవిత సెప్పంగనేర్చిన కాలమెన్న
నొక్క రజతోత్సవంబయ్యె నక్కజముగ
నందు జటప్రోలుసంస్థానమందుఁ జేరి
పదియునైదేండ్లు లీలగా వరలుచుండె॥ 151

గీ॥ పదియునైదేండ్లలోపల వ్రాసినాఁడ
నేఁబదికిమించు గ్రంథంబు లెన్నియేని
సంఘ మెనుబదిఁ గూర్చె పుష్పంబులెన్న
భారతీ! నీకృపాదృష్టి వడయఁబట్టె॥ 152

గీ॥ లక్ష్మరాయభూపాలుఁ డాహ్లాద మొదవ
నంకురార్పణ మొనరించినందు కిట్లు
స్నేహలత నాఁడునాఁడు బుష్పించుచుండెఁ
దెలుఁగురాజులసన్నిధి వెలయుచుంట॥ 153

సీ॥ చెళ్లపిళ్లకులాబ్ధి శీతమయూఖుండు
రచియించు సరసవాక్ప్రౌఢి దనర
శ్రీపాదకవిరాజ కృష్ణసుధీమణి
మురిపించు విజ్ఞానబోధ మెఱయ
శ్రీ చిలకమర్తి నృసింహాబుధేంద్రుండు
దనియించు సహజవాగ్ధార వెలయ
వేంకటరమణ కవిప్రవరేణ్యుండు
వినిపించు మధురకవిత్వ మలర
గీ॥ నమరకవచంబు గురియించు నమరశాస్త్రి
మోదరసమిచ్చు శ్రీనాగభూషణుండు
చిత్రకళలెల్ల వెలయించు మిత్రకోటి
యమృతరసవార్ధిఁ దేల్చు నర్ధాంగలక్ష్మి॥ 154
గీ॥ నన్నుఁ గవిఁజేయు శ్రీరామనాథగురుని
మఱువఁజాలను జన్మజన్మములకైనఁ
దెనుఁగుతీపన్న నెట్టిదో తెలియఁగలిగె
వాని వాగ్విలాసోదయ ప్రభలచేత॥ 155
గీ॥ నడుపు స్థిరబుధలేఖ లన్న పస కొంత
వ్రాయు మిత్రలేఖలు పెద్దవారికైనఁ
బడసె యోగ్యతాపత్రముల్ వారివలన
సంఘ వినోదిని గౌరవాస్పదము నయ్యె॥ 156
గీ॥ విశ్వనాథుండు వీక్షించు వేయికనుల
వేయునేటికి? నాచతుర్వేదుల కుల
వార్ధిచంద్రుం డమరశాస్త్రి పలుకు నభయ
మంచు నది నాకు రక్షగా నమరుచుండు॥ 157

గీ॥ ఇట్లు నలువదాఱేడులు పృథ్విఁ గడచెఁ
దక్కఁ గలకాల మీరీతిఁ దనరనిమ్ము
మిత్రలేఖికాయుగమందు మెలఁగినాఁడ
నన్న మాటయే చాలుఁ బేరాస లేదు॥ 158

ఉ॥ లోపము లేదు నాకు నిలలో రతనాంబికసత్కృపారతిన్
నీపటుశక్తి నూతఁగొని నేర్పుకొలంది భజింతు నెప్పుడున్
దీపిత సౌఖ్యమున్ బలముఁ దేజము ధైర్యము ధీపటుత్వమున్
బ్రాపుగ నిచ్చి ప్రోతువని నమ్మినభక్తుఁడ శ్రీసరస్వతీ॥ 159

చ॥ అనలునిసాక్షిగాఁ గొనిన యంబుజనేత్రను గూడి నీకథల్
వినుచుఁ బఠించుచున్ దఱచు వేడ్కలు మీరఁగ వ్రాయుచున్ మఱిన్
వినుచుచుఁ గాలయాపనము విజ్ఞులు మెచ్చెడిరీతిఁ జేయుచున్
మనమున భక్తిఁ గాంచి నిను మాటికిఁ గొల్చెద నమ్మ భారతీ॥ 160

ఉ॥ ఎన్నిభవంబు లొందితినొ యెందఱు తల్లులుదండ్రులైరొ యిం
కెన్నిభవంబు లుండునొ మఱెందఱు తల్లులుదండ్రు లౌదురో
యెన్నఁగరాని దీవిషయ మెవ్వరుఁ జెప్పఁగలేరు కాన నా
కెన్నఁడుఁ బుట్టనట్టి పద మిమ్ము సరస్వతి! ముక్తిగల్గఁగన్॥ 161

ఉ॥ వాసనలేని పూవువలె. వార్తయులేని ప్రసక్తివోలె వి
న్యాసములేని కైతవలె నాథుఁడులేని పురంబువోలె ను
ల్లాసములేని విద్యవలె లక్ష్యమెఱుంగని జ్ఞానికైవడిన్
నీ సముదంచితస్తవము నేర్వనిజన్మము వ్యర్థ మంబికా!॥ 162

ఉ॥ వ్రాయ దొకప్పుడున్ బరుషవాక్యము నాకల మెన్నఁడేనియున్
వ్రాయఁదలంప దెన్నఁడుఁ బరాభవమున్ గలిగించుమాటలున్
వ్రాయుచునుండు నిచ్చలు విరామముఁ జెందక మిత్రలేఖలన్
వ్రాయుటయన్న సుంతయును బద్ధకమూనదు నీకృపారతిన్ 163

ఉ॥ నాకలమన్న నీవయని నమ్మికఁ గాంచినయట్టివాఁడఁ జీ
కా కొనగూర్చువ్రాతలను గ్రమకవిత్వ కళాప్రశస్తితో
నేకముఁజేసి చెప్పుటకు నిష్టముఁ గాంచినయట్టివాఁడ లో
కైకశరణ్యవంచు నిను నెప్పుడుఁ గొల్చెడువాఁడ భారతీ॥ 164

ఉ॥ నాకును రాజమిత్రులకు నన్నదనేలునృపాలకోటికిన్
బ్రాకటమైత్రిఁ జూపు కవిరాజసభాళికి నాప్తకోటికిన్
నీ కమనీయదృష్టిఁగొని నీపయినిల్పిన కావ్యరాజమున్
జేకొను రత్నమాంబకును నిత్యసుఖంబుల నిమ్ము భారతీ॥ 165

గీ॥ కొల్లపురమందు నున్నట్టి కూర్మిసఖులు
నాకుఁ జేదోడువాదోడుఁ గాకయున్న
మిత్రలేఖ లీరీతిగా మెఱయునొక్కొ?
కాన వారికి నానమస్కార మిడుదు॥ 166

గీ॥ చెల్మి దనరార శ్రీచంద్రశేఖరుండు
వృద్ధిఁగనుచున్న కందకశీశ్వరుండు
ఇద్ధగుణతేజుఁ డా రామకృష్ణసఖుఁడు
వెలయుచున్నారు సంఘాభివృద్ధిఁ గోరి॥ 167

గీ॥ చూడనట్టి కవీంద్రులుగూడ మత్పు
రాకృత ప్రాభవంబున వ్రాయుచున్న
వారు మిత్రలేఖల నట్టివారిఋణము
నెట్లు తీర్పంగఁజాలుదుఁ బృథ్విలోన॥ 168

గీ॥ దేహసౌఖ్యంబు నానాఁడు దిటముఁ గాంచు
బుద్ధిబల మెంతయేనియుఁ బొసఁగియుండుఁ
గలముచూపిన వేగంబు పలుకనేల?
మిత్రలేఖలు వేలపై మించునెపుడు॥ 169

గీ॥ శ్రీ జగన్నాథనృపుఁడు మెచ్చికొనురీతిఁ
దెలుఁగుఁ జేసితి నాంగ్ల నీతిప్రబోధ
పద్యగద్య భావప్రౌఢి వరలునట్లు
ప్రకట మొనరించె నదియు శ్రీరాజఘనుఁడు॥ 170

గీ॥ అష్టదిగ్గజములతోడ నలరుచుండి
కృష్ణరాయల సభగాఁగ నెనయు "భువన
విజయ" మనుగూర్చి వ్రాయంగ స్వీకరించె
నాంధ్రసాహిత్య పత్రి కాహ్లాదగరిమ॥ 171

గీ॥ వెలమసంస్థానమందున వెలయుచుంటఁ
దెలుఁగురాజులసన్నిధి వెలుఁగుచుంట
నాంధ్రసాహిత్యజగతిఁ బేరందినాఁడఁ
గాన గొల్తు వారలఁ గృతజ్ఞతవహించి॥ 172

ఉ॥ శ్రీకరముఀ యశస్కరము సిద్ధమునీశ్వర సేవితంబు లో
కైకశుభప్రదంబు సకలేప్సితదాయక మార్గ సజ్జనా
నీకశరణ్యమై వెలయు నీపదపంకజయుగ్మ మర్థిమై
జేకొనువారి కెల్లపుడుఁ జేకురుఁగాదె సుఖంబు భారతీ॥ 173

ఉ॥ బిరుదుల కేమి? నేఁటిపృథివిన్ బదివేలు గడింపవచ్చు వా
గ్గరిమఁ గలట్టివార లెటుగాంచినఁ గల్గినఁ జెల్లవచ్చు నె
క్కరణి వహింపఁ జెల్లు? బుధకాంక్షము విన్నదియు నవ్వకున్నె? యా
గరువ మదేలనీ కనుచుఁ గావున నెప్పటిరీతి నుంచెదన్॥ 174

గీ॥ గురుఁడు చిలుకమర్తి నృసింహకోవిదుండు
బోధ చేసినమార్గానఁ బోదలంచి
నాఁడె నెట్టిఫలాపేక్ష వీడఁబోక
తెలుఁగుసాహిత్యజగతిలో మెలఁగువాఁడ॥ 175

గీ॥ ఉత్కంఠకు నెగఁబ్రాకఁ గీర్తిఁ గనినట్టి । జీవితం బల్పమైనను సిద్ధిఁ గాంచుఁ
గాకివోలె నుర్వరిఁ జిరకాలమున్నఁ । బేరునూరును లేని జీవిత మదేల?॥

ఉ॥ మానవజన్మ ముత్తమము మాటలు వేయి వచింపనేల? య
ద్దాన ఘనంబుగాదె వసుధన్ బురుషాకృతిఁ గాంచుటన్న, నా
పైనఁ గవిత్వమన్న నిలపైఁ గలవిద్యలలోన నుత్తమం
బైనదిగాన దానిఁ గనుటన్న సమస్తముఁ గాంచుటే సుమీ॥ 177

ఉ॥ మానవు లెల్లవారలును మానితకీర్తి గడింపఁ దగ్గ వి
జ్ఞానము దైవదత్తముగఁ గాంచినవేళ వృథాప్రసక్తికిన్
బూనక సత్కవిత్వరసమున్ గురియించెడు గ్రంథరాజముల్
పూని పఠించినన్ గలుగుఁ బోఁ దుది నక్షయమోక్షసంపదల్॥ 178

సీ॥ సంగంబు విడువని జపతపంబు లవేల
మోక్షంబునకుఁ గాని పూజలేల
హరినిష్ఠ లేని యోగాభ్యాస మదియేల
తత్త్వార్థ మెఱుఁగని ధ్యానమేల
మతధర్మ మెఱుఁగని మంత్రసిద్ధి యదేల
భక్తిభావము లేని భస్మమేల
భూతదయారతిఁ బొందని తను వేల
శాస్త్రార్థ మెఱుఁగని చదువదేల

గీ॥ రసవిహీనమైన కవితాప్రతిభయేల । పరిమళంబు లేనట్టి పుష్పములవేల
జ్ఞానసిద్ధినిఁ గాంచని జన్మమేల । నిన్ను దర్శింపలేనట్టి కన్నులేల?॥

సీ॥ నీనామ మెల్లప్డు నిష్ఠచే జపియింపఁ
దొలఁగవా? దుర్భర దుఃఖతతులు
నీపాదపూజ సన్నియతిచే సలుపంగ
నారదా? క్రూర ఘోరాఘసమితి

నీసేవ లేప్రొద్దు నెఱపుచుండినవేళఁ
బాయవా సంసారభారగతులు
నీధ్యాన మేవేళ నిండారఁ జేసినఁ
గాలదా దుస్తరకర్మవితతి
గీ॥ నీదునామంబునం దింతనిగ్గు గలదొకో నిన్ను నమ్మి చేసినపూజ నెగడుచుండు
ద్వత్కటాక్షంబు సంసారతారకంబు ప్రథితవైభవాలంబ! శ్రీభారతాంబ!

సీ॥ ఏదేవినామంబు నెలమిమై జపియింప
సకలార్థసంపదల్ సంభవించు
నేమాత యందఱ కేలికసానియై
కంటిరెప్పపగిదిఁ గాచుచుండు
నేతల్లి ప్రేమాన నీరేడుజగముల
యందు నంతర్లీనయై వసించు
నేశక్తి శక్తులకెల్లను మూలమై
ప్రకృతిరూపంబున వరలుచుండు
గీ॥ నట్టిశ్రీదేవి వీవ పరాంబ వీవ, రాధవీవ గోదేవివి ప్రకృతివీవ
తులసివీవ సావిత్రివి దుర్గవీవ, యన్నిటికి మూలమైన గాయత్రివీవ॥

ఉ॥ అంచితభక్తి నీమహిమ మద్భుతలీలల వెల్గునంచు వి
న్పించిన, సత్యదీక్షఁగొని నీదగువిగ్రహ మెల్లెడన్ ప్రతి
ష్ఠించిన, నీకథల్ వినినఁ జిత్తము నీపదమందుఁ జేర్చి ధ్యా
నించిన నిందునందునను నివ్వటిలున్ సకలార్థసంపదల్॥ 182

ఉ॥ అర్ధనిమేషమైనఁ గనునాదృతిమై నినుఁ గొల్చునట్లు నే
వ్యర్థముగాఁగఁ గాలమును బాడొనరింపనియట్టు లెన్నఁడున్
స్వార్థముఁ గోరకే రచన సాగెడురీతి నొనర్చుమమ్మ సి
ద్ధార్థుని రీతి జీవితఫలాశయ మొందఁగఁ జేసి భారతీ!॥ 183

శా॥ లక్షల్ కోట్లు జపంబుసల్పినను వాలాయంబుగాఁ బెక్కు తీ
ర్థ క్షేత్రంబులు భక్తిభావములరన్ దర్శించినన్ భారతీ
సాక్షాత్కారము గల్గునే? విమల విజ్ఞానార్థ శాస్త్రాంబుధిన్
దీక్షన్ మునకలువెట్టకున్న నెటు లుత్తీర్ణున్ ననున్ జేసితో॥ 184

ఉ॥ నీ కృపయున్నవారి కవనిన్ సమకూడు సమస్తసంపదల్
నీకృప దప్పెనేని హవణింపవుసూ యవి యెట్టివారికిన్
నీకరుణాకటాక్షమున నే గద విష్ణు విరించి శంభులున్
శ్రీకరులై జగద్భరణ సృష్టి లయోద్యతులైరి భారతీ॥ 185

ఉ॥ జ్ఞానమువచ్చినంత నొకనాఁడు భవత్పదపద్మసేవ లే
మానియెఱుంగ, సత్కవనమార్గము దాటియెఱుంగ, సత్కృతుల్
మానియెఱుంగ వేఱొకటి మానుదుఁగాని, తదేకదీక్ష సం
ధానముఁజేసి నిన్ గొలుచు ధర్మము మానియెఱుంగ భారతీ॥ 186

ఉ॥ ఒక్కనిమేషమైనఁ దను వుండినదానికి సార్థకంబుగాఁ
బెక్కుకృతుల్ రచించెదు వివేకముఁ బాయక నీదుకాంతి స
మ్యక్కళగాఁగ లేఖలు సమంచితభక్తినిఁ బాదుకొల్పి నేఁ
జెక్కుచునుందు నాకిదియ జీవికగాఁ దనరారు భారతీ॥ 187

మ॥ కవితాసంఘ మొకండు కొల్లపురిలోఁ గల్పించి సంస్థానభూ
ధవులెల్లన్ దగురీతి సాయమిడఁగా ధర్మంబుఁ బోనాడకే
కవితాలేఖల సృష్టిఁజేసి యిలలోఁ గాలంబు పోనెట్టి ని
క్కవి సుబ్రాయఁ డటన్నకీర్తి నిడు మెక్కాలమ్మునన్ భారతీ॥ 188

ఉ॥ ఆశువుగాఁగ నిన్ను సముదంచిత పద్యసుమాళితోడ నా
యాశలుదీరునట్లుఁగ నిరంతరమున్ భజియించునట్లు వా
గీశుఁడుమెచ్చునట్లు కృతకృత్యతఁ గాంచెదునట్లు భారతీ
పేశలమైన వాక్కు లిడవే దయనింపి తరింపఁజేయవే॥ 189

ఉ॥ నా రతనాంబ సంపదలు నాకిడ నేమిట లోటులేదు నిన్
గోరను వానికై మఱలఁ గోరికలీరికలెత్తఁ దల్లి! నేఁ
గోరుదు సౌఖ్యజీవితము కూరిమిపెంపున నిమ్మదాని నిం
డారిన నీకటాక్షశకలాకలనాయతి శ్రీసరస్వతీ॥ 190

శా॥ తల్లీ! నీశుభదర్శనంబున భవద్గాథా చమత్కార దీ
వ్యల్లీలా ప్రతిభావిలాస రసవద్భాగ్యంబు వర్ణింపఁగా
నెల్లల్ మీఱెడు ప్రేమభావ మెదలో నీరాజ్ఞి రత్నాంబ సం
ధిల్లన్ జేసి క్షణంబులోనఁ బ్రకటింపన్ నీకటాక్షమ్మునన్॥ 191

ఉ॥ ఆయమ యాకృతిన్ మిగులనాదరభావముతోడఁ జూచె సు
శ్రేయ మెసంగు నీకథలఁ జెప్పటఁజేసి జగంబులోన నా
కీ యశ మబ్బఁజేసెఁ దరియించితి నీకృపచేతఁ గాన దీ
ర్ఘాయువు రాజ్ఞికిమ్ము కృతులన్నియు నిల్ప నితోధికంబుగన్॥ 192

శా॥ శ్రీయున్ సంపదలిచ్చి భూపప్రజలకున్ జేదోడుగానుండి సు
శ్రేయంబొప్పఁగ రాజ్యపాలనకళా రేఖావళుల్ దిద్ది సౌ
ఖ్యాయత్తంబుగ నేలు రాజ్ఞి కెపు డత్యారోగ్యసంధాన పూ
ర్ణాయుర్దాయము నిమ్ము భక్తజనరక్షా! దీనరక్షామణీ!॥ 193

శా॥ తల్లిం దండ్రినిఁబోలి భూపప్రజలకున్ ధర్మంబు శాసించుచున్
గొల్లల్గా ధనధాన్యరాసు లిడు మా కొల్లాపురాధీశ్వరిన్
దల్లిన్ వేంకటరత్నమాంబజననిన్ దత్సంతతిన్ గీర్తి సం
పల్లీలా విభవంబు లిచ్చి యనుకంపన్ బ్రోవు మోభారతీ॥ 194

శా॥ దేవ బ్రాహ్మణభక్తిఁ గల్గి సతమున్ దీక్షాభిమాన క్రియా
భావానూనపటుత్వవృద్ధి రచనాప్రావీణ్యమున్ జూపి నీ
సేవాధర్మ మతిక్రమింపక గుణశ్రీయుక్తి దీపించు శ్రీ
దేవిన్ వేంకటరత్నమాంబజననిన్ దీవింపు మోభారతీ!॥ 195

శా॥ వాపీ కూప తటాక సత్కృతులు దేవస్థాన సంతానముల్
స్థాపింపంగల ధర్మబుద్ధిఁగొని రాజ్య ప్రాజ్య లోకావన
వ్యాపారంబున నేర్పు లేర్పడచు రత్నాంబామహారాజ్ఞికిన్
బ్రాపై రక్షణసేయుమమ్మ జననీ! ప్రత్యక్షసాక్షాత్కృతీ॥ 198

సీ॥ కరుణారసం బొల్కఁగాఁ బల్కుటయె కాని
పరుషవాక్యంబులఁ బలుకఁ డెపుడు
నిచ్చుచో దాన మొంతేని నిచ్చుటకాని
యింతయిచ్చితి నంచు నెంచఁ డెపుడు
నుపకారమును జేయ నుత్సహించుటకాని
యపకారగుణ మొందు నరయఁ డెపుడు
సత్యవాక్యంబుల సార మొంచుటకాని
కలనైన ననృతంబుఁ బలుకఁ డెపుడు
నెట్టియెడనైనసాహసమింతదాల్చువీరుఁడేకాని వెనుకంజ వేయఁ డెపుడు
నిట్టి శ్రీజగన్నాథసమ్రాట్టు నెపుడు భారతీ! శుభదృష్టిఁగాపాడుమమ్మ!
నిండుకూర్మివరమ్ములు రెండొసంగు శ్రీమాజగన్నాథభూపాలమౌళి కిష్ట
ఫలరత్న సంప్రాప్తియభ్యుదయపూర్తి రాజ్ఞికిమ్ము చిరాయువు రాణమీఱ॥

చిత్రవిచిత్ర సంగతులఁ జేర్చి రచించెడువారు నీకృపా
పాత్రతఁ గాంతురన్న నిను వర్ణనఁజేసి రచించుకావ్య మే
మాత్రముఁ దీసిపోదనెడుమాటయె యూఁతఁగఁ గాంచి నీకళా
చిత్రముమాత్రమే రచనఁజేసితి వాక్కొలంది భారతీ!॥ 199

ఎల్లర భుక్తిముక్తులిడి యేలెడుతల్లివి దీనకోటులన్
జెల్లఁగఁ బ్రోచుతల్లివి విశాలమనమ్మున భక్తకోటి రం
జిల్లఁగఁ జేయుతల్లివి; వచింపఁగ నేల? జగంబులోపలన్
దల్లులకెల్లఁ దల్లివి ముదంబిడుతల్లివి నీవె భారతీ!॥ 200



[illegible] నా హృదయంబులో మిము ఘనంబుగ నిల్పితి భక్తి పెంపునన్
దేహమునుండుదాఁక జగతీపతి! మిమ్ము స్మరించుచుందు నా
స్నేహలతాకవిత్వ పుష్టిసిద్ధికి వృద్ధికిఁగారణంబు మీ
దోహదమే యటంచుఁ దలఁతున్ సతతంబును లక్ష్మరాట్ప్రభూ!

[illegible] నీకృపచేతఁగాదె ధరణీపతి! కొల్లపురంబుఁ జేరుటల్
నీకరుణాకటాక్షములు నెక్కొనుటన్ గద నాఁడునాఁటికిన్
ప్రాకె మదీయసంఘ మొకపట్టున విఘ్న మెఱుంగఁబోక యో
శ్రీకర! లక్ష్మరాయనృపశేఖర! వృద్ధిగనుంటి నన్నిఁటన్॥

మ॥ పదునారేడులవెన్కఁ గొల్లపురిలోఁ బ్రారంభమున్ గాంచుచుం
బదిలంబొప్పఁగ రత్నమాంబిక దయాపారీణతన్ గాంచి నే
ర్దువల్లేక తెలుంగుకూతు రిలలోఁ గొండంతగా నయ్యె నా
కెదలో సంతసమయ్యె ధన్యుఁడయితిన్ బృథ్వీశ! వేయేటికిన్॥

[illegible] ఓ ధరణీమనోహర! బహూక్తులు చాటఁగనేటికీజగ
న్నాథుఁడు మీకుమారుఁడు ఘనంబుగ నన్గురుభక్తితోడ నా
రాధనసేయు, మీసుత సరస్వతియున్ గురుభక్తి నింపు, నా
కీధరలోన లోపమొకయింతయు లేదు సుఖంబు గల్గెడిన్॥

గీ॥ వేలువేలుగఁ జాటి విన్పించనేల?
బిడ్డలంద ఱావంతయు వెలితిలేక
గురుఁడనంచు సద్భక్తితోఁ గొలుచుచుండ్రి
మఱువశక్యంబె మీమాట మానవేంద్ర!॥



ప్రొద్దటూరు శ్రీజానకీముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది, 1944.